వాళ్ళచేత వస్తువుల నపహరింపజేయువారును, తూకములో మరుగుపెట్టి మోసము చేసి చూపించి దానినెల్ల మాయము చేయువారును, మాటలతో బహుళపందిళ్ళు వేసి యాశచేతిలో స్వర్గమునకు నిచ్చెనవేసి ధనములాగువారును, ఈపట్టణమునిండ కుప్పతిప్పలుగా నున్నారట. ఇదియే సత్యమయ్యెనేని, నేటితో నేను చెడిపోయినాను, నేటికాలమునకు సాధనమునకు అక్కలునిచ్చి దానికని నాకును ఋణము చెల్లిపోయి నావద్దనుండి అది యెగిరిపోయినది కాబోలును! నేను చెప్పిన నక్షత్రమువద్దకుపోయి వాడెక్కడ నున్నాడేమో వానికి పట్టుకొనెదను. [అని వెళ్ళుచున్నాడు.]

---

## ద్వితీయాంకము.

---

ప్రథమరంగము—పెద్దవసంతకుని గృహము.

[సీతయు, సుభద్రయు, ప్రవేశించుచున్నారు.]

సీత—సుభద్రా! ఇదేమి? నాప్రాణేశ్వరుడున్నూ రాలేదు; నాప్రాణేశ్వరుని వేగిరం వెదకితీసుకురమ్మని పంపిన భృత్యుడున్నూ జాడలేదు. ఇప్పుడు రెండుజాములు దాటిపోయింది.

సుభ—ఎవరైనా అతణ్ని భోజనానికి పిలుచుకొనిపోయినారేమో! అతడు యింటికిరాకుండానే మధ్యదారిలోనుంచే వెళ్ళి వుండవచ్చును. భోజనానికివచ్చేవేళ మించిపోయింది. ఇకమనం కనిపెట్టుకుని వుండనక్కరలేదు; భోజనంచేతాములే. మగవాళ్ళు పరమస్వతంత్రులు; వాళ్ళేమిచేసినా మనమేమీ అనకూడదు.

సీత—మనకులేని స్వాతంత్ర్యము మగవాళ్ళకుమాత్ర మెందుకుండవలెను? నేనెక్కడకయినా వెళ్ళి వక్కదినము వేళకు యింటికిరాకపోతే వారూరుకుంటారేమో!

సుభ—మనవలె మగవాళ్ళు యింట్లోకూర్చుండవలసినవాళ్ళుకారు. వాళ్ళు బయటతిరిగి పనిచేసి కుటుంబపోషణానికయి చెమటవూడ్చి కష్టపడిసంపాదించి తేవలసినవారు. అందుచేతనే వారికి స్వేచ్ఛ అధికంగావున్నది. వారేమిచేసినా మనం తప్పు పట్టక వారి కణగివుండవలెను. సృష్టిలోవున్న సమస్తజంతువులున్నూ ఆడవి మొగవాటికి లోబడివుండడం సహజం.

సీత—రేపు నీకు పెళ్ళయి నీమొగుడు వేళకు యింటికిరాక తిప్పలు పెడితే నీవప్పుడేమిచేస్తావు?

సుభ—అతను యింటికి వచ్చేవరకూ శాంతంవహించి కనిపెట్టుకునివుంటాను.

సీత—ఇతరుల విషయంలో మాటలెన్నైనా చెప్పవచ్చును. స్వవిషయంలో

మాత్రం చెప్పినట్టు నమ్ముకోవడం బహుకష్టం. తనవిషయంలో యిపటివాడు శౌర్యం చేసినప్పుడు నీవు చెప్పిన శాంతమూ గింతమూ అవతలకు వస్తవి. నీకు నిజంగా మగడువచ్చి యీప్రకారముగా నిన్ను బాధపెట్టినప్పుడు నీశాంతశాంతం వహిస్తావో మేము చూడకపోము లే-

సుభ — నేనువివాహం చేసుకోకపోయినంతకే మగడికిలోబడి వుండడం వేర్పరుస్తూను. నాశాంతం నీకుకనపడ్డ దానికయినా నేను శిక్షించగా వివాహమాడుతాను — అనుగోలక్ష్మణుడు వస్తూ వున్నాడు. నీభర్తకూడా వెనుకవస్తూ వుండి వుండవచ్చును.

[పెద్ద లక్ష్మణుడు ప్రవేశించుచున్నాడు.]

సీత — నీయజమానుడుగా రెంత దూరములో వున్నారు?

పెద్దల — నా యజమానుడు నాకు జానెడు దూరంలో వున్నాడు; ఆయన చేతులు మరీ చేరువకువచ్చినవి. రెండు చేతులూ దబదబ నాతలమీదపడ్డవి. ఇవిగో నాదౌడలు కూడా సాక్ష్యమిస్తూ వున్నవి చూడు. (అనివంగి దౌడచూపుచున్నాడు.)

సీత — నీ గీర్వాణము కట్టిపెట్టి తెలుగులో చెప్పు. ఆయన నీతో మాట్లాడినారా? నీవాయనమనస్సు కనిపెట్టినావా?

పెద్దల — ఆయనమనస్సంతా నాశిరస్సుమీద కనపడ్డది. ఆయన మనసేమోకాని చెప్పినమాట వక్కటీ నాకు తెలిసిందికాదు.

సుభ — నీకర్థం తెలియకుండా అతడంత అస్పష్టంగా మాట్లాడినాడా?

పెద్దల — కావలసినంత స్పష్టంగానే మాటలాడినాడు; నాతలమీద దెబ్బలు మరింత స్పష్టంగా కనపడ్డవి. ఆడినమాటలుమాత్రం నాకర్థంకా లేదు.

సీత — ఆయన యింటికి వస్తూ వున్నారేమో చెప్పు. ఆలస్యంగావస్తే భార్యకేమయినా కోపంవస్తుందని సందేహిస్తూ వున్నారని తోస్తుంది.

పెద్దల — ఏసందేహమూ లేదు. నీభర్తకు పిచ్చియెత్తింది.

సీత — ఓరి దుర్భాగ్యుడా! పిచ్చియెత్తిందీ!

పెద్దల — పిచ్చికాకపోతే వెఱ్ఱి, యేదోవకటి యెత్తింది, తప్పకుండా నీమొగుడికి మతిపోయింది. నేను యింటికి భోజనానికి రమ్మంటే, నావేయి వరహాలూ యేమి చేసినావంటాడు; నేను భోజన సమయమయ్యె నంటే, తాను నావొమ్మంటాడు; అన్నం చల్లారిపోయిందంటే, నీచేతికిచ్చిన ధనం తెమ్మంటాడు; అతనికి దయ్యపట్టియెత్తింది. అమ్మగారు కనిపెట్టుకొని వున్నారయ్యాఅంటే, నే నెఱుగనుగారికి యింత గనా. నీఅమ్మగారికి దీనుడావెట్టి తగలబెట్టి రమ్మన్నాడు.

సుభ — ఎవరన్నారు?

పెద్దల—మొవరా? నాయజమానుణ్ని నిభాషగాయన్నా అయిన వసంతకుమా రుగారు. నేను యిల్లుయెరగను పెళ్లాన్ని యెరగను యేమీయెరగను పొమ్మన్నాడు. నేను నోటితో మీవర్తమానం తీసుకునివెళ్ళి తలతో కావలసినన్ని దెబ్బలు మీకు ప్రత్యుత్తరం తీసుకువచ్చినాను.

సీత—నిర్భాగ్యుడా! నీవు మళ్ళీవెళ్ళి నీయజమానుణ్ని యింటికి తీసుకునిరా.

పెద్దల—మళ్ళీ వెళ్ళి మళ్ళీ దెబ్బలు తిని రావడానికా? యిక నేను వెళ్ళను. యీసారి మరివకరిని పంపు.

సీత—మాటు మాటాడకుండా వెళ్ళు. వెళ్ళకపోతే నీతల బద్దలు కొడతాను.

పెద్దల—యీవేళ మీయిద్దరి మధ్యనూ నాతలకాస్తా పగిలి పోతుంది. పగలకుండా వుండడానికి దేవుడు నాకు యినపతలనయినా పెట్టినవాడుకాడు.

సీత—ఆట్టేవాగక వెళ్ళిపో. నీయజమానుణ్ని వేగిరంతీసుకురా.

పెద్దల—వెళ్ళి తీసుకురమ్మని యిక్కడ నీవుతన్నుతావు; వెళ్ళి రమ్మంటూ పిలిచితే అతడు అక్కడ తన్నుతాడు. మీయిద్దరి మధ్యనూ నాకు చావు వ్రాసింది. యీమాటు నేనుచావకుండా బ్రతికివస్తే నావంటిమీద చర్మంవుండదు.

(అని వెళ్ళుచున్నాడు.)

సుభ—ఛీ! వూరుకో. నీమొగంచూస్తే నీవు బొత్తిగా ధైర్యము లేని దానివలె కనపడుతూ వున్నావు.

సీత—నేనుయింట్లో ఆయనకోసం కనిపెట్టుకొనివుండి మాడుతూవుండగా, మరి యొకతెతో ఆయన దాపునచేరి సంతోషిస్తూ వుంటే నేనెట్లా సహించి వూరుకో గలను? నామొగంకాంతి తరిగి వాడబారినట్లు కనబడుతూ వుంటే దానికతఁడే కారణము. నామొగం నిజంగా సౌందర్యముచెడి చిన్నబోయివుంటే, అతడు మళ్ళీవచ్చి వొక్కసారి చల్లనిచూపు చూడడంతోటే నాముఖం యథాప్రకాశంగా అవుతుంది.

సుభ—నీవు లేనిపోని అనుమానంవకటి మనసులో పెట్టుకొని వృథాగా ఖేద పడుతూవున్నావు. నీ అనుమానం వదలిపెట్టు.

సీత—మానాభిమానాలు లేనివాళ్లు యిటువంటిసంగతులు లక్ష్యంచెయ్యక వూర కుండగలరుగాని నేనేలాగు వోర్చి వుండగలను? నేనెఱుఁగుదును; ఆయన దృష్టి నిశ్చయముగా మరియొక్కతె మీదనే వాలింది. లేకుంటే, యింతవేళాయెను యింటికి రాకుండా యెందుకు వుంటారు? నాకోసం చేయిస్తూ వున్న చంద్రహారం యీదినం తీసుక రాకుండా రానని నాతో చెప్పి వెళ్ళినారు. ఆయన సందెవేళకే యింటికి రాకుండా వున్నారను కుంటామంటే, నేను వర్తమానం పంపించినప్పుడు తనకు భార్యా అక్క

లోకరిసెంచి? చేసుకొన్న యిల్లాలినికాదని అన్యమోహా నాంగిమీద నీవలపు నిలుపడానికి నీకేలాగుమనసువచ్చినది? నేనే నిన్నుకాదని కాంచెంపయిజాడలో ప్రవేశించినట్లు నీ వెవని బడినపక్షమున నీమనస్సు కెంతనొప్పి కలుగుచుండి? నీకు సమర్పణచేసియున్న యీ దేహాన్ని కామదేవుడి దుర్బోధ చేత పరపురుష సంపర్కానికి పక్కమాటు లొంగరచిన పక్షమున, నీవు నా మొగముమీద వుమ్మివేసి, నన్ను కాలితో తన్ని, నాశిరచ్ఛేదము చేయవా? భార్యవిషయంలో ద్రోహాంతలవక నీవూ నిర్దోషివిగా వుండి నన్ను దుఃఖాలపాలు చేయక రక్షింపుము.

చిన్నవసం—ఓసుందరీ! నీవింతసేపటినుండియు మాటలాడుచున్నది నాతోనా? మరియొకరితోనా? నీ వెవరవో నేనెఱుఁగను. ఈ కాంచీపురమునకు నేను క్రొత్తవాండను. నేనీగ్రామమునకువచ్చి తిన్నగా జాము సేపయినను కాలేదు. నీప్రసంగము వాలకమును నాకువింతగానున్నవి, ఇంతసేపును నీవుమాటాడిన మాటలలో నొక్కముక్కయినను నాకర్థముకాలేదు.

సుభ—బావా! వూరుకో. నీకిప్పుడీ ప్రపంచమంతా మాఱిపోయినది. మాఅప్పగారిని యీవిధంగా బాధపెట్టడానికి నీవెప్పుడు నేర్చుకున్నావు? భోజనానికి నిన్నింటికి తీసుకునిరమ్మని యీమె లక్ష్మిని నీకడ్డకు పంపినదికాదా?

చిన్నవసం—లక్ష్మినా?

చిన్నల—నన్నా?

సీత—అవునునిన్నే. నీవుమళ్లీవచ్చి నిన్నితఁడు కొట్టినాడనీ యిల్లు లేదన్నాడనీ భార్యాలేదన్నాడనీ నాతో చెప్పినావు.

చిన్నవసం—ఈసుందరితో నీవుమాట్లాడినావా? మీకిప్పుడు జరిగిన సంభాషణ యెందువిషయము?

చిన్నల—నేనా? నేనా! ఇప్పుడుతప్ప యిదివఱకెన్నడున్నూ నేను యీమె మొగమయినా చూడలేదు.

చిన్నవ—ఓరిదురాత్ముడా! నీవబద్ధమాడుచున్నావు. ఇందాఁక నంగడిగినదానికి సరిగా నిప్పుడీమె చెప్పిన మాటలే నీవు నాతో చెప్పినావు.

చిన్నల—నేనుజన్మందెయు త్రినతరువాతయెప్పుడున్నూ యీమెతో మాట్లాడలేదు.

చిన్నవ—ఈబిడకేమో దేవతావేశముండిననేకాని యీమె మనలను పేరులు పెట్టి యేలాగున పిలువఁగలిగినది?

సీత—యజమానుడున్నూ సేవకుడున్నూ యేకమయి యేదో మాయవేయుచున్నారు కాని కిందాన్నీ నన్ను నిష్కారణముగా యేడిపించడంమీకు న్యాయముకాదు. [illegible]

నాయనా! నీవు కల్పవృక్షము వంటివాడవు; నా సమీపమున నాటిన మల్లికాలత వంటిదానను. నీమీద అల్లుకొనడానికి నాకనుకూలమయిన స్వతంత్రంవున్నది. లత నిన్ను చుట్టుకొని వున్నప్పుడే నీకు శోభ యెక్కువగా వుంటుంది. కల్పవృక్షాన్నంటుకొని మఱియేతీగ నా పెరిగితే అది బదనికగాని మఱేదీ కాదు. అది వున్నట్టే వుండి క్రమక్రమముగా శాఖాశ్రయించి వున్నదాన్నే విస్తరించేసి నాశనం చేస్తుంది. కాబట్టి అటువంటిది పుట్టడంతోటే మొదలంటా తీసివెయ్యవలెను.

చిన్నవ—ఈమె నాతో నే మాటాడుచున్నదా? ఈమె చెప్పెడిదంతయు నా విషయమేనా? నే నీమెను స్వప్నములో వివాహమాడినానా యేమిటి? లేక నేనిప్పుడు నిద్రపోవుచుండి యీమె చెప్పెడు మాటలు వినుచున్నానా? నన్నే భూతమావహించెనో కాని నాకన్నులను చెవులనుగూడ మోసము చేయుచున్నది! ప్రత్యక్షముగా జరుగుచున్న యీ యింద్రజాల మేమో తెలిసికొను వఱకును నే నీమె మాటకు మాటాడక లోబడి యూరకుండెదను.

సుభ—లక్ష్మణా! నీవు వెళ్ళి వేగిరం వడ్డన చేసి యింటికాడ సిద్ధంగా వుండుమని చెప్పు.

చిన్నల—భూతభయం లేకుండా వుండడానికి నేను చిన్నప్పుడు నేర్చుకున్న మంత్రం జపం చేసుకుంటాను. ఇది తప్పకుండా దయ్యాలదేశము. మేము దయ్యాలతోనూ, భూతాలతోనూ, పిశాచాలతోనూ, కామినీలతోనూ మాట్లాడుతూ వున్నాము గాని మనుష్యులతో మాటాడడం లేదు. మేమీ రాకాసులు చెప్పినట్టు వినకపోతే మమ్మల్ని పీడించి పీక్కుతింటవి.

సుభ—నీలోనీవేమో ప్రేలుకుంటూ నేను చెప్పినదానికి బదులు చెప్పవేమి? ఓదుంనా! మొద్దా! శిలా! నిన్నే. మాటాడు.

చిన్నల—వీళ్లు మంత్రశక్తిచేత నన్నేదో మరియొక జంతువుగా మార్చివేసినారు. స్వామీ! నేనిప్పుడు నీకు లక్ష్మణునిగానే కనబడుతూవున్నానా?

చిన్నవసం—నీవు నీలాగుననే యున్నావు. నేనును నాలాగుననే యున్నానని తలంచెదను.

చిన్నల—మన మిద్దరమూ మనస్సులోనూ రూపములోను కూడా మారిపోయినాము స్వామీ!

చిన్నవసం—నీరూపము యథాప్రకారముగానే యున్నది.

చిన్నల—లేదు. వీళ్లు నన్నిప్పుడు కోతిని చేసి ఆడిస్తూవున్నారు.

చిన్నవసం—నీవే జంతువుగానైనా మారినపక్షమున నీవు గాడిదవుగా మాత్రమే గాని మఱియొక జంతువుగా మారలేదు.

చిన్నల—అవును. వీళ్ళు నాచేత గడ్డితినిపించి నామీ... ...లా సవారు చేస్తూవున్నారు. నేను గాడిద నేకాకపోతే వాళ్లు నన్ను యెరిగివున్నట్టే వాళ్ళను నేనున్నూ యెరిగివుందును.

సీత—(చిన్నవసంతకుని చేయిపట్టుకొని) రండిరండి. యజమానుడున్నూ భృత్యుడున్నూ చేరి నన్ను వేళాకోళంచేస్తూవుంటే కంట్లోవేలుపెట్టుకొని యేడుస్తూ చూస్తూవూరుకుండడానికి నేనువెఱ్ఱిదాన్నికాను. భోజనానికి దయచెయ్యండి. (అని లాగుచున్నది.)—లక్ష్మణా! నీవుగుమ్మమువద్దవుండి నేనున్నూ నాప్రాణనాధుఁడున్ను లోపల భోజనంచేస్తూవున్న కాలంలో యెవరినీ లోపలికి రానియ్యకు. నాభర్తగారికోసం యెవరైనవచ్చి నిన్ను తలుపుతియ్యమంటే, లోపల భోజనంచేస్తూవున్నారు. తలుపుతియ్యడానికి వల్లకాదనిచెప్పి పంపివెయ్యి. యెవరికయినా తలుపుతీస్తే నీతలకాయ బద్దలుకొడుతాను.

చిన్నల—వసంతకా! నేను గుమ్మంకాడ కావలివుండనా?

సీత—ఎవరినైనాలోపలికి రానిచ్చినావంటే తప్పకుండా నీతలపగలకొడుతాను.

సుభ—వసంతకా! వేగిరరమ్మును. ఇప్పటికే భోజనానికి చాలా ఆలస్యం అయింది. [అని యందఱును వెళ్ళుచున్నారు.]

---

## తృతీయాంకము.

[ప్రథమరంగము—వసంతకునిగృహము ముందు

[పెద్దవసంతకుఁడును, పెద్దలక్ష్మణుఁడును, విశ్వకర్మయను స్వర్ణకారుఁడును, కాంచనగుప్తుఁడను వర్తకుఁడును, ప్రవేశించుచున్నారు.]

పెద్దవసం—విశ్వకర్మా! నన్నిప్పుడు వదిలిపెట్టవలెను. నేనింటికాలస్యముగ వెళ్ళినప్పుడు నాభార్య మిక్కిలి కోపకోపలాడుచుండును. చంద్రహార మిప్పటి సిద్ధమగునేమోయని యింతసేపటివఱకును మీయింట్లో నున్నాననియు, సాయంకాలము మదిమెఱుఁగుపెట్టి తీసికొనివచ్చెదననియు నాభార్యతో చెప్పు—ఇక్కడ వీఁడొకఁడున్నాఁడు. వీఁడంగడివీధిలో నన్ను కలిసికొన్నాఁడఁట! నేను తన్ను కొట్టినానఁట! తనచేతికేమో వేయివరాలనిచ్చినానన్నాఁడఁట!—ఓకితాగుబోతా! నీమాటలకర్థమేమి?

పెద్దల—మీరు మీమనసువచ్చినట్లు చెప్పండి. నేనెఱిగింది నేనెఱుఁగుదును. నన్ను మీరు తప్పకుండా కొట్టినారు.

పెద్దవసం—నీవు గాడిదవుగా కనపడుచున్నావు.

పెద్దల—మీచేతి దెబ్బలుతిని పూరుకోవడంవల్ల నేనాలాగే కనపడుతూ వున్నాను. గాడిదనైతే నేను మిమ్మల్ని తన్నవలసినది; అట్లాచేసినట్టయితే మీరు జాగ్రత్తగావుందురు.

పెద్దవసం—తలుపు వేసియున్నది. మనలను లోపలికి రానిమ్మనిపిలువు

పెద్దల—ఓమాలీ! ఓదామోదరా! ఓకిరామా! ఎవరులోపల? తలుపు తియ్యండి.

చిన్నల—(లోపలినుండి) యెవడురావాడు తెగఅరుస్తూవున్నాడు? వీడేమి మతిపోయిందాయేమిటి? వెళ్ళిపో.

పెద్దల—తలుపువద్ద కాపలివున్నవాడెవడో మనప్రభువుగారు వీధిలో నిలుచు న్నారు. వేగిరంతలుపుతియ్యి.

చిన్నల—(లోపలినుండి)అతడు యెక్కడనుంచివచ్చాడో మళ్లీ అక్కడికే పడవమను. వెళ్ళిపోతే నిలుచోలేక అతనికాళ్ళే నొప్పులు పెడతవి.

పెద్దల—ఆలోపల మాట్లాడేవారెవరో తెలుపుతియ్యండి.

చిన్నల—(లోపలనుండి) మంచిది నీవు యెందుకువచ్చినావో చెప్పితే నేను చెప్పవలసినమాట తరువాత చెప్తుతాను.

పెద్దవసం—ఎందుకా? భోజనమునకు; నేనీదినమున భోజనము చెయ్యలేదు.

చిన్నల—ఈదినము నీకిక్కడ భోజనం దొరకదు. మరిపకరోజురా.

పెద్దవసం—నీవెవడవు? నాయింటికి నన్ను రానీకున్నావు?

చిన్నల—ఈవేళకు నేను కాపలికాచేవాణ్ని. నాపేరు లక్ష్మణుడు.

పెద్దల—ఓరిదొంగా! నాపనిమాత్రమే కాకుండా నాపేరుకూడా దొంగిలించి నావు! యీవేళకు లక్ష్మణుడవైతే మతికొంతసేపటికి నీవుగాడిదవు కూడా అవుతావు.

సుభ—(లోపలినుండి) లక్ష్మణా! గుమ్మముదగ్గిర ఆ అల్లరేమిటి? కేకలు వేసే వారిని పంపివెయ్యి.

పెద్దవసం—ఎవడురా? ఎంతపిలిచినను తలుపుతీయకున్నాడు?

చిన్నల—(లోపలినుండి) ఎంతచెప్పినా పోకుండా గుమ్మంకాడ కేకలువేసేవా రెవరురా?

పెద్దవసం—నేను వసంతకుడను. తలుపుతీయుము.

చిన్నల—(లోపలినుండి) వసంతకుడు సీతతో లోపల భోజనము చేయు చున్నాడు. నేను తలుపుతియ్యను వెళ్ళిపో.

పెద్దవసం—(తనలో) వసంతకుడు సీతతో లోపల భోజనము చేయుచున్నా

శివ! నాభార్యతో లోపల మఱియెవ్వఁడో యున్నాఁడు. (బిగ్గరగా) లక్ష్మణా! గునపము తీసికొనిరా.

పెద్దల—తలుపు బద్దలయ్యేటట్టుగా గట్టిగా గుద్దండి.

పెద్దవసం—కాదుకాదు. గునపము తీసికొనిరా తలుపుబద్దలుకొట్టి లోపలికి వెళ్లుదము.

చిన్నల—(లోపలినుండి) ఏదీ తలుపుబద్దలుకొట్టు. నేను తలుపు బద్దలుకొట్టినవానితల బద్దలు కొట్టుతాను.

కాంచ—శాంతము వహించు. అటువంటిపనియెన్నఁడును చేయఁబోకుము. అట్లు చేయుటచేత నీవే రచ్చపడి యింతవఱకును నీభార్యవిషయమయి మంచియభిప్రాయము గల జనుల కంటికిని సందేహము కలిగించినవాఁడవగుదువు. నీవేమియు అవమానపడఁబోకు. నీభార్య మిక్కిలి బుద్ధిమంతురాలనియు, గుణవంతురాలనియు, మహాపతివ్రత యనియు, చిరకాలానుభవమువలన నీకు తెలిసియే యున్నది. ఇప్పుడు తలుపుతీయక పోవుటకు కారణమేమో అవల నీకామె తెల్లగా విన్నపము చేయును. నామాటవిని శాంతమవలంబింపుము. మన మందరము గలిసి యీపూట ప్రభావతిగారియింట భోజనము చేయుదమురండి. సాయంకాలము నీవింటికిగావచ్చి తలుపు తీయనందుకు కారణమడిగి తెలిసికొందువుగాని లే. ఇప్పుడు నీవు బలవంతముగా తలుపు బద్దలుకొట్టి లోపలికి వెళ్ళినపక్షమున జనులు దాని కనేకార్థములు చేయుదురు; అందుచేత నీవు పోయిన తరువాతకూడ అపకీర్తి శాశ్వతముగా నుండిపోవును.

పెద్దవసం—నీవంతగా చెప్పుచున్నావు గనుక నీమాటవిని మరలెదను. ప్రభావతి మిక్కిలి యోగ్యురాలు; బహు చమత్కారముగా సంభాషించును; భోజనమునకు వెళ్ళినవారిని మిక్కిలి ఆదరణచేయును. అవును. మన మక్కడకు భోజనమునకు వెళ్ళుదము—విశ్వకర్మా! ఈపాటికి చంద్రహారము సిద్ధమయియుండవచ్చును; నీవింటికి వెళ్ళి వేగిరము నాయొద్దకు తీసికొనిరా. నాభార్య యీప్రకారముగా నన్నవమానపఱిచినది గనుక దానిని వంచన చేయుటకయి యీచంద్రహారమును ఊరకేయైనను ప్రభావతి కిచ్చెదను. వేగిరము వెళ్ళు.

విశ్వ—నాలుగు గడియలలోపల చంద్రహారమును తీసికొనివచ్చి మిమ్ము కలిసికొనెదను.

పెద్దవసం—అలాగున చేయుము. నన్నీప్రకారముగా పరిభవించినందుకు తన నష్టమునకయిన నొప్పుకొనవలెను. (అందఱును వెళ్ళుచున్నారు.)

## ద్వితీయరంగము—గృహమునందలి వీధిచావడి.

---

[సుభద్రయు చిన్నవసంతకుఁడును ప్రవేశించుచున్నారు.]

సుభ—వసంతకా! నీవీప్రకారముగా పెనిమిటి కుండవలసిన ధర్మమునుమఱచి పోవచ్చునా? నాఅప్పగారిని ధనం నిమిత్తమే పెండ్లాడిన పక్షమున, ఆధనమునిమిత్తమయినా తిన్నగా చూడు. నీ ప్రేమ మరివక చోటవున్న పక్షమున, ఆపనిదొంగతనంగా చెయ్యి. నీలోపల వున్న అభిప్రాయం పయికి తెలియనియ్యక మనసులో నయినా దాచుకో. చల్లని చూపుచూచి, తియ్యగా మాట్లాడి, నీకృత్రిమము కనపడకుండా నైన వుండు. నీమనసులో యేదోషంవున్నా పయికయినా వేషం బాగా వెయ్యి. చాటున నీయిష్టం వచ్చినట్టుచేసినా అది పయికి కనపర్చవలసిన అవసరం యేమున్నది? లోపల ద్రోహం చెయ్యడమే కాకుండా పయికికూడా అప్రియంగా మాట్లాడుతూ వుంటే, నీవు రెండుదోషాలు చేసినవాడ వవుతావు. దుశ్చేష్టలు పరుష వాక్యములవల్ల రెట్టింపుగా బాధపెడతవి. అయ్యో! మాఅప్ప స్థితిమాత్రే నాకెంతో విచారంగా వున్నది. ఆడవాళ్ళముగనుక మేము యేమాటచెప్పితే ఆమాటలే నమ్ముతాము;మమ్మన్ని మాటలచేతనైనా సంతోషపెట్టి నిజంగా మామీదప్రేమవున్నట్టయినానటించరాదా? ఎలాగయినా లోపలికివచ్చి మాఅప్పగారికి ధైర్యముచెప్పి వోదార్చి భార్యవని పిలువు. నీమంచిమాటలవల్ల వకరిదుఃఖం పోగొట్టఁ గలిగినప్పుడు మనసులో లేనిది కొంచెం చెప్పడం పాపంకాదు.

చిన్నవసం—ఓప్రియురాలా! నాపేరు నీ వెట్లెఱిగినను నీపేరునేనెఱుఁగనుగనుక దిన్నాలాగున పిలిచినందుకు క్షమించు. మాయలును వేషములు నుపదేశించుటకు నీవు మహోపాధ్యాయురాలవుగాఁ గనఁబడుచున్నావు. మనసులో నొకటి యుంచుకొని పయికొకటి మాటాడుమని నాకు నేర్పుచున్నావా? సత్యము నే పలుకుట కలవాటుపడిన నానిర్మలమయిన మనస్సును సత్యమునుండి మళ్ళించుటకయి యేలవృథా శ్రమపడియెదవు? నీవు దేవుఁడవయి నామనస్సును క్రొత్తగా సృష్టించఁగలశక్తి నీకు వచ్చినట్టయితే, అప్పుడు నాకుతిమాఱునేమోగాని యిప్పుడు న్యాయమార్గమునుండి తొలగింజంతయు మళ్ళదు. ఇప్పుడు నేనున్నప్రకారముగా నీయప్పగారెంతకన్నుల వెంబడిని నీరుగార్చినను నాభార్యకాదనియు, ఆమెను నేనెప్పుడును వివాహము చేసికొలేదనియు నేను దృఢముగా నెఱుఁగుదును. నాప్రియురాలా! నీయప్పగారి కన్నీటి సముద్రములో నన్ను ముంచివేయుటకు ప్రయత్నింపకు. నీవొకవేళ నన్నువరించుమని కోరినయెడల నే నొప్పుకొందును. నీ ముంగురులను ఉరిత్రాళ్ళతో నన్ను కట్టి

చేయుము; నేనప్పుడు నిన్ను భార్యనుగా పరిగ్రహించి నీకుబద్ధుడనయి యుండెదను.

సుభ—నీకు పిచ్చియెత్తిందా యేమిటి? అలాగున మాట్లాడుతూ వున్నావు!

చిన్నవసం—నాకు పిచ్చియెత్తలేదుగాని కొంతవఱకు మతి భ్రమించినది. ఎందుచేతనో మాత్రము నేను చెప్పలేను.

సుభ—ఆమతిభ్రమ నీదృష్టిదోషమువల్లనే సంభవించినది.

చిన్నవ—ఆదృష్టిదోషము నీదేహమునుండి సూర్యకాంతివలె మిఱుమిట్లు గొలుపు నీరూపమును జూచుటవలననే సంభవించినది.

సుభ—నీవు నాకేసిచూడక యెవరికేసి చూడవలెనో వారికేసి చూడు. నీదృష్టి దోషం నిమిషంలో పోతుంది.

చిన్నవ—ప్రియురాలా! యితరులను చూచుటకంటె కన్నులు మూసికొనుట యుత్తమము.

సుభ—'ప్రియురాలా!' అని నన్నెందుకు పిలుస్తావు? ఆపేరుతో నాఅప్ప గారిని పిలువు.

చిన్నవసం—నీఅప్ప కేవలము సోదరియే.

సుభ—నాకు సోదరియే.

చిన్నవసం—కాదు నాకును. నీవే నాకు ప్రియురాలవు. నీవే నాప్రాణమునకు ప్రాణమవు.

సుభ—ఇదంతా నాసోదరివిషయంలో వుండవలెను. ఇదివఱకు లేకపోయినా, యికముందయినా ఆలావుండవలెను.

చిన్నవసం—నాప్రియురాలా! నీవే నాప్రియురాలవని చెప్పు. నేను నీవాడను; నాప్రేమ నీమీద నున్నది. నాజీవితకాలమును నీతోగడపెదను. ఇంకను నీకును వివాహముకాలేదు. నాకును వివాహముకాలేదు. నన్ను పాణిగ్రహణము చేసికొమ్ము.

సుభ—ఈపాటి యీమాటలుచాలించు. మాఅప్పను నీవద్దకు తీసుకువస్తాను; ఆమెతో మంచిమాటలాడి ఆమెను సమాధానపఱుచు. (అని పోవుచున్నది.)

[లోపలినుండి చిన్నలక్ష్మణుడు ప్రవేశించుచున్నాడు.]

చిన్నవసం—అదేమిలక్ష్మణా! అంతవేగముగా పరుగెత్తుకొని వచ్చుచున్నావు!

చిన్నలక్ష్మ—మీరునన్నెరుగుదురా? నేనులక్ష్మణుడన్నా? నేనుమీసేవకుడన్నా నేను నేనేనా?

చిన్నవసం—నీవులక్ష్మణుడవే. నీవు నాసేవకుడవే. నీవునీవే.

చిన్నల—నేను గాడిదను; నేనుఆడుదాని దాసుడన్ను; నేను నేనుకాను

చిన్నవసం—అసుదాని దాసుడవెట్లయినావు? నీవు నీవుకాకపోవుట యేమి?

చిన్నల—నేను మంత్రాన్ని. నేను నేనుకాను. నేనొక స్త్రీవాణ్ణి—ఎవతో నామీద పడితుంది; నాదగ్గరకు వస్తుంది; నన్ను తనవాణ్ణంటుంది.

చిన్నవసం—నీవేలాగున తనవాడవన్నది.

చిన్నల—నన్ను మృగంక్రింద కట్టివేసి నన్ను తనవాణ్ణిగా చేసుకొన్నది. నేను పశువునని నా అభిప్రాయముకాదు; అది శుద్ధ పశువు గనుక దానికి మొగుణ్ణయితే నేను పశువును కాకపోతానా?

చిన్నవసం—అదియెటువంటిది?

చిన్నల—బహుపెద్దమనిషి. పగలుచూస్తే రాత్రికలలోకి వస్తుంది. అదికట్టుకున్న బట్టలు బండెడు కర్రలు పెట్టి తగలబెట్టినా తగులవు. దానివంటినున్న చముర్తో యీవూరంతా అయిదురోజులు దీపాలు వెలిగించుకోవచ్చును.

చిన్నవసం—అది బహుయోగ్యురాలా?

చిన్నల—పెద్దమనిషంటే నా అభిప్రాయం అట్లుకాదు. అది ఆకాశగంలో ఎత్తుగా అంతేవున్నది. అదిభూదేవివలె గుండ్రంగా వున్నది. దానిపేరు గౌరట!

చిన్నవసం—అదియే భూదేవి యయిన పక్షమున పర్వతము లెక్కడనున్నవి?

చిన్నల—పిరుదులే పెద్దపర్వతాలు.

చిన్నవసం—మరి సముద్రము లేవి?

చిన్నల—కళ్ళూ చెవులూ మహాసముద్రాలు.

చిన్నవసం—నదులేవి?

చిన్నల—రోమకూపాలలోనుంచి వచ్చే చెమట వెయ్యినదులు పెట్టుగావున్నది.

చిన్నవసం—అడవులేవి?

చిన్నల—తలంతా యీతదుప్పలాగువుండి మహారణ్యంగా కనబడుతుంది. ఆ గ్రామదేవత, అనూకాలమ్మ, ఆకాశుని నన్ను తనమొగుడంటుంది; నాపేరు పెట్టి పిలుస్తుంది; నన్ను కౌగిలించుకో వచ్చేటప్పటికి భూతమని జడిసి తప్పించుకొని పారిపోయివచ్చి యివతలబడి ప్రాణాలు దక్కించుకున్నాను.

చిన్నవసం—ఇకమనమిక్కడ నుండగూడదు. తక్షణమే వెళ్లి యెంత శీఘ్రముగ అయినను సరే యొకబండిని కుదుర్చుకొనిరా. మనకెంత వచ్చు బెడ్డబండి దొరికినను, ఈరాత్రి మనమీ గ్రామములో నిద్రచేయగూడదు. నీవుమరలవచ్చినదాక నేనొకడ వీధిలో తిరుగుచుండెదను. వేగిరముగవచ్చి నన్ను కలిసికో. ఈగ్రామములోని వారందరును మనల నెరిగియు మన మొక్కరిని ఎరుగక యున్నప్పుడు, మనమిక్కడ శీఘ్ర

మాటయు ముల్లెయు కట్టుకొని తెచ్చి పోవలసినదే.

చిన్నల—పెళ్లామనని నన్నుపట్టుకొన్న బ్రహ్మరాక్షసిచేతులలోనుండి తప్పించుకోవడం కలిగితే పెద్దపులి నోట్లోనుంచి తప్పించుకొన్న లేడిలాగు పరుగెత్తుతాను.

(అని వెళ్లుచున్నాడు.)

చిన్నవసం—(తనలో) ఈపట్టణములో దయ్యాలపోతులు తప్ప మరియెవరును కాపురముండరు. కాబట్టి యీయూరువిడిచి నేనెంత వేగిరము వెళ్లిన నంతమంచిది. నన్ను మగండని పిలిచిన దానిపేరు దలంచుకొన్న నాదేహము కంపమెత్తుచున్నది. అయినను సౌందర్య రాశియైనయామె చెల్లెలుమాత్రము తన మృదు మధురవాక్యములచేతను విలాసముచేతను హావభావాదులచేతను నామనస్సును వశపరచుకొన్నది.

[చంద్రహారముతో విశ్వకర్మ ప్రవేశించుచున్నాడు.]

విశ్వ—వసంతకా!

చిన్నవ—అవును నాపేరువసంతకుడే.

విశ్వ—ఆసంగతి నాకుబాగా తెలుసును. ఇదుగో మీరు తెమ్మన్న చంద్రహారము. మెరుగుపెట్టడం వేగిరముకాకపోవడముచేత యింతసేపాలస్యమయింది.

చిన్నవ—నీయిష్టమేమి? నేనిది యేమిచెయ్యను?

విశ్వ—మీకోసం చేసినాను. మీయిష్టంవచ్చినట్టు చేసుకోండి.

చిన్నవ—నాకోసరమే చేసినావా? నేనెప్పుడును చేయుమనలేదే.

విశ్వ—ఒకమాటుకాదు; రెండుమాట్లుకాదు; యిరవైమాట్లుచెప్పినారు. ఇది మీయింటికి వేగిరముపట్టుకొనివెళ్లి మీభార్యను సంతోషపెట్టండి. నేను సాయంకాలం భోజనంవేళకు మీయింటికివచ్చి దీనిసొమ్ము పట్టుకు వెళుతాను.

చిన్నవ—కొంచెము సేపుండి సొమ్మిప్పుడే పుచ్చుకో. లేకపోయినపక్షమున నీవు చంద్రహారమును నేనునుకూడ మరల కనపడము.

విశ్వ—(చిరునవ్వునవ్వి) నాసొమ్మెక్కడికిపోదు. మీరు మహోచితులయిన మనుష్యులు. నేనిప్పుడు వెళ్లిపోతాను. (అని వెళ్లుచున్నాడు.)

చిన్నవ—(తనలో) నాకీమాయయేమో తెలియకుండ నున్నది. ఇంత మంచి చంద్రహారము నూరక యిచ్చెద నన్నప్పుడెంత తెలివితక్కువ వాడును తనకక్కరలే దనడు. ఈప్రకారముగా వీధులలో బంగారుగొలుసులు దొరకుచున్నప్పుడు, ఇక్కడ నెవ్వడును కష్టపడనక్కరలేదు. నేనంగడివీధికి వెళ్లి లక్ష్మణుని కొఱకయి యెదురు చూచుచుండెదను. వాడు బండిదొరకుపుచ్చుకొని వచ్చినపక్షమున, అక్కడి నుండియే వెళ్లిపోయెదను. (అని వెళ్లుచున్నాడు.)

---

## చతుర్థాంకము.

ప్రథమరంగము:—పురవీథి.

[ఒకవర్తకుడును, విశ్వకర్మయు, ఒకరాజపురుషుడును ప్రవేశించుచున్నారు.]

వర్త — నేను నీకు సొమ్ము బదులిచ్చి సంవత్సరము దాటిపోయినది; అప్పటినుండియు నేను నిన్నేమియు సొమ్మునిమిత్తము తొందర పెట్టలేదు. నేనిప్పుడకస్మాత్తుగా హస్తినాపురమునకు వెళ్ళవలసిన పని తటస్థించి యవశ్యముగా సొమ్ము కావలసివచ్చినదిగాని లేనిపక్షమున నేనిప్పుడు సహితము సొమ్మునిమిత్తము నిన్నింత నిర్బంధ పెట్టకయే పోదును. కాబట్టి వెంటనే సొమ్మిచ్చివేయుము. లేనిపక్షమున, ఈరాజపురుషుడిప్పుడు నిన్ను పట్టుకొని ధర్మస్థానమునకు తీసికొని వెళ్ళును.

విశ్వ — నేను నీకు బాకీవున్నంత సొమ్మే నాకు వసంతకుడీయవలసి వున్నది. నిన్ను కలుసుకోవడానికి వకగడియముందే నేనతనికి చంద్రహారమిచ్చినాను. అయిదు గంటలవేళ నాకతడు సొమ్ము యిచ్చివేస్తాడు. నన్ననుగ్రహించి వక్క పర్యాయం నీవతనియింటిదాకా నాతోకూడావస్తే నీసొమ్ము నీకిచ్చివేసి నాపత్రం నేను పుచ్చుకుంటాను.

[పెద్దవసంతకుడును, పెద్దలక్ష్మణుడును ప్రవేశించుచున్నారు.]

రాజపురు — మీరాయనయింటికి వెళ్ళవలసిన శ్రమ తప్పిపోయినది. అదుగో వసంతకుడే యిలాగు వస్తూవున్నాడు.

పెద్దవ — నేను కంసాలియింటికి వెళ్ళెదను; ఈలోపుగా నీవంగడికి వెళ్ళి పేప బెత్తమొకటికొని తీసికొనిరా. నన్ను మధ్యాహ్నము లోపలికి రాకుండ తలుపు వేయించినందునకయి నీ యజమానురాలిని, తలుపుతీయనందునకయి పరివారమును, శిక్షింపవలెను. అదుగో విశ్వకర్మ వచ్చుచున్నాడు. నీవు వేగిరము వెళ్ళి, బెత్తము కొని యింటికి పట్టుకొనిరా.

పెద్దల — వక్క బెత్తముకాదు; మీకుకావలిస్తే వెయ్యిబెత్తాలు కొనితీసుకువస్తాను.

(అని వెళ్ళుచున్నాడు.)

పెద్దవ — నిన్ననమ్ముకొన్నవాడు చక్కగానే బాగుపడును. నేను నీకొఱకును చంద్రహారంకొఱకును నీమాటను నమ్ముకొని యింటో నేను కాచుకొనియున్నాను. ఎంతసేపు కనిపెట్టుకొనియున్నను నీజాడగాని చంద్రహారముజాడగాని కన

పడలేదు. చంద్రహారము వేగిర మిచ్చిన పక్షమున నీతో పనియుండదని మొగము చాటువేసినావా యేమి?

విశ్వ—మీహాస్యమిప్పుడు మాని వెయ్యండి. బంగారంయెంతయెత్తో, యేజన్నె కూలియెంతో, అంతా పద్దువ్రాసి యిదిగో తెచ్చినాను. మీరుయివ్వవలసిన మొత్తమంతా నేనీ ఋణకియ్యవలసిన దానికంటె మూడురూపాయలు యెక్కువగావుంటుంది. ఈయన దూరదేశము వెళ్ళవలసి యీసొమ్ముకోసమే నిలిచి వున్నాడు. వేగిరం సొమ్మిచ్చి మనిష్షిని పంపివెయ్యండి.

పెద్దవ—ఇప్పుడు నేను సొమ్మిక్కడకు తీసికొనిరాలేదు; అంతేకాక నాక గ్రామములో కొంచెముపనియున్నది. నీవీయనను మాయింటికి తీసికొనివెళ్ళి, చంద్రహారము నాభార్యచేతికిచ్చి నేనిమ్మన్నానని సొమ్మడిగిపుచ్చుకో. ఒకవేళ నేనున్న మీరక్కడనుండగానే రావచ్చును.

విశ్వ—అలాగయితే చంద్రహారము మీరే తీసుకవస్తారా?

పెద్ద—నేను తీసికొనివెళ్ళను. ఒకవేళ నేనువేగిరం రాకపోదునేని నీవే తీసికొని వెళ్ళు.

విశ్వ—మంచిది నేనే తీసుకొనివెళుతాను. చంద్రహారం యిప్పుడు మీదగ్గిర వున్నదా?

పెద్దవ—నాదగ్గఱలేకపోయిన నీదగ్గఱనున్నది. ఇప్పుడు నీవద్ద లేనియెడల సొమ్ములేకుండ నీవుమరల వచ్చినదారినే వెళ్ళవలసి వచ్చును.

విశ్వ—దయచేసి చంద్రహారం వేగిరంయివ్వండి. ఈయనసిద్ధంగాప్రయాణం కట్టుకొని వచ్చినాడు. ఆలస్యంచేస్తే ముహూర్తం మించిపోతుంది. వేగిరంపంపించ నందుకు ఈయన నన్నుదూషిస్తాడు.

పెద్దవ—సరి! సరి! వ్యవహారము చక్కగానే కుదిరినది. అన్నప్రకారముగా చంద్రహారము నీవుతీసికొని రానందునకయి నేను కూకలు వేసికొందునని తప్పించుకొనుటకై నీవీపన్నుగడ పన్నినావు. నీవుయుండగానే యిచ్చుట కారణమింకని యెడల, వేళకు తీసికొనిరానందునకు నేను నిన్ను తిట్టుదు ననుకొన్నావా?

వర్త—కాలము వ్యర్థముగా పోవుచున్నది. శీఘ్రముగా నన్ను పంపివేయవలెను.

విశ్వ—ఆయన నన్నేలాగు తొందరపెడుతున్నారో విన్నారా? చంద్రహారం-

పెద్దవ—యింతకోపమెందుకు? నాభార్యచేతికిచ్చి సొమ్మపుచ్చుకో.

విశ్వ—[illegible]. ఇంతకుమునుపే మీచేతికి చంద్రహార మిచ్చినాను గదా? ఆచంద్రహారముయినా లేకపోతే మరిదేనికైనా వస్తువుయేదైనా అనవాలిచ్చి పంపండి.

పెద్దన—ఛీ! పో. నిపుణత మఱివిస్తారము చేయుచున్నావు. చంద్రహార మెక్కడ నున్నది? ఏదీ నన్ను చూడనిమ్ము.

విశ్వ—నాకనేక కావలసినంత పనివున్నది. యీప్రకారంగా మీతో పరాచకములాడుతూ కూర్చోవడానికి నాకు తీరుబడి లేదు. నాకు మీరు సరియైన ప్రత్యుత్తరం యిస్తారా యివ్వరా? లేకపోతే మిమ్మల్ని యీ రాజపురుషుడికి వప్పగిస్తాను.

పెద్దన—నీకు నేను ప్రత్యుత్తరమియ్యవలెను గా! ఏమని ప్రత్యుత్తరమిమ్మన్నావు?

విశ్వ—చంద్రహారం నిమిత్తంవీరు నాకివ్వవలసిన సొమ్మిచ్చి వెయ్యండి.

పెద్దన—నీవు చంద్రహారమిచ్చినదాఁక నీకు నేను సొమ్మియ్య నక్కఱలేదు.

విశ్వ—గడియసేపటికిందట మీకిచ్చివేసినాను.

పెద్దన—నీవు నాకియ్యలేదు; యిదేమాటయే మరల మరల ననుచుండుట వలన నాగౌరవమునకు లోపము తెచ్చుచున్నావు.

విశ్వ—లేదనడంవల్ల నాపరపతికే మీరుభంగం కలిగిస్తూవున్నారు. మీమాట నిజమని లోకస్తీ నాకెక్కడనయినా పరపతి వుంటుందా?

వర్త—ఓయి రాజపురుషా! క్రమప్రకారముగా నీవీకంసాలిని పట్టుకో.

రాజ—దొరతనమువారి యుత్తరువుప్రకారముగా నీవు ధర్మస్థానమునకు నడువు. తిరుగుబాటు చేస్తే నీకు శిక్ష అవుతుంది.

విశ్వ—యిందువల్ల నాకుమానభంగం వస్తుంది. నాబదులుగా సొమ్మివ్వడానికయినా వప్పుకోండి. లేకపోతే నాపరువు పోయేటప్పుడు మీపరువుమాత్రం వుంచునా? భృత్యమిచ్చి మిమ్మల్నికూడా యీ రాజపురుషుడిచేత పట్టుకునేటట్టు చేస్తాను.

పెద్దన—నాకియ్యని వస్తువునకయి సొమ్మిచ్చుటకు నేనెన్నఁడయిన నొప్పుకొందునా? ఓయి బుద్ధిహీనుడా! నీచేతనైనపక్షమున నన్నుకూడ పట్టుకొనునట్లు చేయుము.

విశ్వ—ఓరాజపురుషా! నీభృత్యంయిదిగో. నాఫిర్యాదు ప్రకారంగా ఈయనను పట్టుకొని న్యాయస్థానమునకు దీసికొనిరా. ఇంత బహిరంగముగా నన్నవమాన పరచినందుకు ఈయన మర్యాదమాత్రము నేనునిలుపుతానా?

రాజ—ఇతని అభియోగము మీరు విన్నారా? మీరుకూడ ధర్మస్థానమునకు నడవండి.

పెద్దన—నేనుజామీనిచ్చుటకు సిద్ధముగ బడి యుందును.—ఛీ! నీదుకాణములోనున్న బంగారమంతయు ఈవ్యవహారముతోపోయి నీకు ముష్టిచెంబు చేతికి వచ్చునులే.

విశ్వ—కానీలే. మీ బెదిరింపు చూదాము. ఈపట్నం రాజాయేలుతూవున్నాడు. గాని ముండ యేలడంలేదు. వ్యవహారంలో గెలిచి మీవద్ద వడ్డీతోకూడా సొమ్మువుచ్చుకుంటానుగాని వదిలిపెట్టను,

[చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—మధుర వెళ్ళడానికి బండి సిద్ధంగా వున్నది; నేను మీకోసం ముందే బండి కుదిర్చివచ్చినాను. మీరు రావడమే అవశిష్టం. సెలవయితే మన సామాను బండిలో వేయిస్తాను.

పెద్దవ—నీకు పిచ్చిపట్టినదా యేమి? మధురకు వెళ్ళుట కేబండి సిద్ధముగా నున్నది?

చిన్నల—మీరు నన్ను కుదుర్చుకుని రమ్మన్నారండి.

పెద్దవ—నీవు త్రాగుబోతువుగా కనఁబడుచున్నావు! నిన్ను బెత్తము తెమ్మని పంపినాను.

చిన్నల—కాదండి. మీరు నన్ను బండికోసమే పంపినారు.

పెద్దవ—ఇప్పుడు నీతో వివాదమాడుటకు నాకు తీరదు. నేను చెప్పినమాటలు తిన్నగా వినుచుండుటకై తరువాత నీకు బుద్ధి చెప్పెదను. నా యీమాటలకు తిన్నగా సీతయొద్దకు వెళ్ళి, ఈతాళపుచెవి దానిచేతికిచ్చి, నగలపెట్టెలో పట్టుగుడ్డతో కట్టిన రూపాయలమూట వేగిరము తెమ్మన్నానని చెప్పి పట్టుకొనిరా. రాజభటులు నన్ను పట్టుకొన్నారనియు, ప్రాతిభావ్య మియ్యనియెడల నన్ను కొట్టులో పెట్టుదురనియుఁ చెప్పు. మాఱుమాట చెప్పక పరుగెత్తు.—రాజపురుషా! సొమ్ము వచ్చులోపల మనము మెల్లఁగా నడచుచుందము; రమ్ము. (వర్తకుఁడును, విశ్వకర్మయు, రాజపురుషుఁడును, పెద్దవసంతకుఁడును వెళ్ళుచున్నారు.)

చిన్నల—సీతయింటికా మళ్ళీ వెళ్ళడము! అక్కడికి వెళితే గౌరి నన్ను మొగుణ్ణని మళ్ళీ పట్టుకుంటుంది. ఈమాటు దాన్ని వదిలించుకొని రాలేను. నాకు యిష్టం లేకపోయినా వెళ్ళమన్న చోటికి వెళ్ళకతప్పదు. సేవకు లెప్పుడూ పరాధీనులు.

(అని వెళ్ళుచున్నాఁడు.)

---

ద్వితీయరంగము—పెద్దవసంతకుని గృహముముందు.

[సీతయు, సుభద్రయు, ప్రవేశించుచున్నారు.]

సీత—సుభద్రా! ఆయన నిన్నాప్రకారంగా నీమీద మోహం కనపరిచే మాటలన్నారా? ఆయన మనస్ఫూర్తిగానే అలాగన్నారో, లేక హాస్యానికే అన్నారో చూపులవల్లనూ ముఖచేష్టలవల్లనూ నీవు బాగా కనిపెట్టినావా? ఆయన గంభీరంగా చూచినాడా? తెల్ల తెల్లపోయి చూచినాడా? ముఖం విచారంగా వున్నదా? సంతోషంగా వున్నదా? అతని మనస్సేమైన దుఃఖలక్షణములనుబట్టి తెలుసుకోగలిగినావో లేదో చెప్పు.

సుభ—అతఁడు మొట్టమొదట నీవు తనకు భార్యవే కావన్నాఁడు.

సీత—నన్ను వివాహమే చేసుకోలేదన్నాఁడుగా! ఏమిపాపము పండినది!

సుభ—ఆటుతరువాత తానీవూరికి రాలేదన్నాని ప్రమాణముచేసినాఁడు.

సీత—అంత అప్రమాణానికికూడా లోబడ్డాడుగా!

సుభ—అప్పుడు నేను నీపక్షంగా మాట్లాడినాను.

సీత—అతఁడేమి చెప్పినాఁడు?

సుభ—నీమీద ప్రేమభంగపరిచిందని నేను వేసుకుంటే తాను నామీద ప్రేమ వుంచుతానని నన్ను వేడుకో మొదలుపెట్టినాఁడు.

సీత—అతఁడు యేమిషమీద నిన్ను మోహిస్తానన్నాఁడు?

సుభ—యోగ్యుఁడయినవారు డొంకవదులు స్వీకరించినట్లుగానే నాకేమిషా కనపడలేదు. అతఁడు మొట్టమొదట నాసౌందర్యము పర్ణించి, తరువాత నాసంభాషణ పొగడినాఁడు.

సీత—నీవు నావద్దగకపటంవిడిచే చెప్పుతూవున్నావా? నీవేమైనదురుద్దేశముతో—

సుభ—శాంతించు. నీవలాగంటిమాట లనఁబోకు.

సీత—ఇంతపట్టు జరిగినతరువాత నేనేలాగు శాంతించహించగలను? నామనసు వూరకుందామన్నా నానోరు వూరకుండదు. అతఁడు నీతిమాలినవాఁడు; కూరుఁడు; ద్రోహి; పాతకుఁడు; చండాలుఁడు; అతని మొగం చూడరాదు.

సుభ—అటువంటివాడి నిమిత్తమయి ఆశపడడం యెందుకు? ఎవత్తో అతని కాశపడ్డదని అనుమానపడడం యెందుకు? అటువంటి దుర్మార్గుఁడు వదలిపోవడమే నీకు క్షేమం.

సీత—నామనస్సు నావాక్కువలె లేదు. నోరుతిడుతూవున్నా మనస్సు అతని కోసమే ఆశపడుతూవున్నది.

[చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—(రొప్పుచు) ఇదిగో తాళంచెవి. నగలపెట్టె వేగిరంపట్టుకురా?

సుభ—ఆలాగున వగరుస్తున్నా వేమి?

చిన్నల—వేగిరం పరుగెత్తుకొని రావడంవల్ల.

సీత—నీయజమానుఁ డెక్కడ? ఆయన సుఖంగావున్నారా?

చిన్నల—లేదు. ఆయన చిక్కులోపడ్డాఁడు. యెవరికింకెరుడిపించవా. డబడు అతణ్ని పట్టుకొని తీసుకుపోతూవున్నాఁడు; మిమ్మల్ని వృత్తి అక్కడికి వెళితే

మళ్లీవదిలిరాను; నాకు భయంవేస్తూవున్నది.

సీత—భయంవదలి తిన్నగా చెప్పు. ఏమిజరిగింది?

చిన్నల—ఏమిజరిగిందో నాకు తెలియదు. నాయజమానుణ్ని రాజపురుషులు పట్టుకొని తీసుకుని వెళుతూవున్నారు.

సీత—ఏమీ! ఆయనను పట్టుకున్నారా? ఎవరిఫిర్యాదుమీద?

చిన్నల—ఎవరి ఫిర్యాదుమీద పట్టుకున్నారో నాకుబాగా తెలియదు. ఆయనను రాజభటులు తీసుకొని వెళుతూవున్నారు. నాకది బాగా తెలుసును. విడదల కావడానికి నగలపెట్టెలోవున్న సొమ్ము నీవుయిస్తావా లేదా?

సీత—సుభద్రా! పెట్టెతాళంతీసి రూపాయలమూట పట్టుకొనిరా.

(అని తాళముచెవి యిచ్చుచున్నది.)

సుభ—(పుచ్చుకొని) ఇప్పుడేవస్తాను. (అని వెళ్ళుచున్నది.)

సీత—అద్భుతంగావున్నది! నాకు తెలియకుండా ఆయనఅప్పెక్కడ చేసినారు? ఏదైనా పత్రింవ్రాసియిచ్చినారా?

చిన్నల—ప్పతంకాదు. నగ—నగ.

సీత—యేమినగ?

చిన్నల—నాకదంతా నీతో చెపుతూవుండేవడానికి అవకాశంలేదు. వేగిరత వెళ్ళవలెను. నేను యిందాకాబయలుదేరేటప్పటికే రెండుఘంటలయింది; ఇప్పుడప్పుడే వంటిఘంటవేసినారు.

సీత—యేమి? నీకోసం కాలం వెనక్కు పోతూవున్నదికాబోలును! నేను యిదివరకెప్పుడూ రెండుఘంటలు వేసినతరువాత వంటిఘంటవెయ్యడం వినలేదు.

చిన్నల—రాజభటులు పట్టుకుంటే తప్పకుండా కాలమంతా మారిపోతుంది.

సీత—కాలానికి రాజభటుల ఆజ్ఞయేమిటి?

చిన్నల—నీవు వినలేదాయేమిటి? రాజభటులనుచూస్తే దొంగ వెనక్కు పారిపోతాడు. కాలమూ దొంగవంటిదే. అదియెవ్వరికీ తెలియకుండా మెల్లగావచ్చువున్నట్టేవుండి మనుష్యులనే యీలోకములోనుంచి యెత్తుకుపోతుంది. అలాదొంగతనం చేసేటప్పుడు రాజభటులనుచూస్తే కాలంమాత్రం వెనుకకుపోదా?

[రూపాయలమూటతో సుభద్ర ప్రవేశించుచున్నది.]

సీత—లక్ష్మణా! అదుగో రూపాయలమూట. జాగ్రతగా తీసుకునివెళ్ళి రతూరాం నీయజమానుణ్ని వదిలించి యింటికి తీసుకునిరా.—సుభద్రా! నామనస్సులో మేలుగావున్నది. లోపలకు వెళుదామురా. (అని వెళ్ళుచున్నారు.)

చిన్నల—(తనలో) దేవుడా! వీళ్ళ చేతులలో పడక యిప్పటికి బ్రతికి బయటపడ్డాను. ఇక యిక్కడ నిలవకుండా పరుగెత్తుతాను. (అని వెళ్ళుచున్నాఁడు.)

---

తృతీయరంగము—ఒకవీధి.

[చిన్నవసంతకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నవసం—(తనలో) నన్నెప్పుడో యెఱిఁగినవారివలెనే యిక్కడి వారందఱును నాపై దండము పెట్టుచున్నారు; అందఱును నన్ను పేరుపెట్టిపిలిచి పలుకరించుచున్నారు; కొందఱు నాకు సొమ్మియ్యవచ్చుచున్నారు; కొందఱు భోజనమునకు పిలుచుచున్నారు; కొందఱు తమకు నేనుచేసిన యుపకారమునకని వందనములు చేయుచున్నారు; కొందఱు కోనుటకయి మంచిమంచివస్తువులను తెచ్చి చూపుచున్నారు. ఇంతకుమునుపే యొకకుట్టుపనివాఁడు నన్ను తనయింటికి పిలుచుకొనిపోయి, నానిమిత్తమయి కొన్నపని కొన్న పట్టుగుడ్డలను చూపి, నాశరీరమును బట్టి కొలఁతెపుచ్చుకొన్నాఁడు. ఇదంతయుచూడఁగా యీపట్టణములో మళయాళమంత్రగాండ్రుతప్ప మఱియెవ్వరును కాపురముండనట్టుకనఁబడుచున్నది.

[చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—నన్ను తెమ్మనిపంపిన రూపాయలబిగో మీరా యముదూతనువదుల్చుకున్నారా?

చిన్నవ—ఇవి యెక్కడి రూపాయలు? ఏయముదూత?

చిన్నల—యమలోకములోవుండే యమదూత కాదు; భూలోకములోవుండే యమదూత. పన్నపాటి పులిచర్మం మెడలో వేసుకుని వూళ్ళోవాళ్ళప్రాణాలన్నీ తీస్తాదూ—అతఁడు. ఇందాకా పిశాచంలాగున మిమ్ము పట్టుకొని తీసుకు వెళుతూవున్నాడు.

చిన్నవ—నీమాటలేమియు నాకు తెలియలేదు.

చిన్నల—ఇదే తెలియలేదా? నాకు స్పష్టంగా తెలుస్తూవున్నవి. మెళ్ళోతోలికె వెండిబిళ్ళ వేసుకొని తిరుగుతాడు; అప్పుపుచ్చుకొని యెగఁబెట్టిన వాళ్ళనూ, నేరాలు చేసినవాళ్ళనూ, తనకేమీ యివ్వని వాళ్ళనూ పట్టుకుంటాడు; అతణ్ణి మీరుయెరగరా?

చిన్నవ—రాజభటుఁడని నీయభిప్రాయమా యేమి?

చిన్నల—అవునతఁడే.

చిన్నవ—నీవిచ్చిమాట లింతటితో కట్టిపెట్టు. ఈదినమున వెళ్ళేడిబండియేదైన దొరకినదా? మనమీరాత్రి ప్రయాణమయి వెళ్ళవచ్చునా?

చిన్నల—బండికుదిరి సిద్ధంగావున్నది మీదే ఆలస్యమని రెండు గడియలక్రిం

దనే మీతోవచ్చి చెప్ప లేదా? అప్పుడు బంట్రోతు మిమ్మల్ని తీసుకు వెళుతూవుండడం చేత తొందరలోవుండి తిన్నగా జవాబు చెప్పినారు కారు. మిమ్మల్ని విడదల చేయించుకోవడానికి తెమ్మన్నరూపాయలివిగో.

చిన్నవ—మీని మతిపోయినది. నేనుమతిపోయిన వానివలెనే కనపడుచున్నాను. మేమిక్కడ మాయలలోపడి తిరుగుచున్నాము. మాపాలిట భాగ్యదేవత వచ్చిమమ్మీ మాయాపన్నముద్రములో నుండి పయికిలేవదీసి గట్టున పడవేయ వలెనుగాని, మాయంతట మేములేవలేము,

[ప్రభావతిప్రవేశించుచున్నది.]

ప్రభా—వసంతకా! మంచి సమయానికి కనపడ్డావు, నీకు కంసాలి కనపడ్డట్టున్నాడు. అదేనా నాకిస్తానన్న చంద్రహారము?

చిన్నవ—పిశాచమా! నన్ను మోసము చెయ్యక వెళ్ళిపో.

చిన్నల—అయ్యో! ఈమె పిశాచమా?

చిన్నవ—ఈమె పెనుభూతము.

చిన్నల—ఈవిడ భూతాలకన్నిటికీ ముత్తవతల్లిలాగు కనబడుతూ వున్నది.

ప్రభా—యీ వేళ యజమానుడున్నూ సేవకుడున్నూ కూడా మహా ఉల్లాసంగా వున్నారు! నాతో వస్తారా! సాయంకాలముకూడా మాయింట్లోనే భోజనము చేస్తురుగాని.

చిన్నల—వెళ్ళవద్దు. వెళితే యీ దెయ్యం మనల్ని పట్టుకుని వదలదు; యెల్లకాలం పీల్చి పిప్పి చేస్తుంది.

చిన్నవ—ఓసి దయ్యమా! నన్ను భోజనమునకు రమ్మనుచున్నావా? నేనురాను వెళ్ళిపో. నీవుదయ్యాల పోతువు.

చిన్నల—ఆలాగయితే మనకేదో దయ్యాన్ని పంపుచేస్తుంది. మంత్రం పారకుండా పళ్ళుపీకించి వెయ్యవలెను.

ప్రభా—మీరు మధ్యాహ్నం భోజనాలవేళ పుచ్చుకొన్న నావుంగరంనాకిచ్చి వెయ్యండి వెళ్ళిపోతాను; లేకపోతే నావుంగరంలోని వజ్రానికి బదులుగా మీరిస్తానన్న చంద్రహారమయినా యివ్వండి. నేను వక్కనిముషం యిక్కడ వుండను.

చిన్నల—దయ్యాలెక్కడయినా కుంభం పొయ్యవలసినదనీ దిగదుడుపు పెట్టవలసినదనీ కోరుతవిగాని నగలు పెట్టమనికోరవు. ఈచండి దుర్గా పాతపరాలు గనుక చంద్రహారం తెమ్మంటూ వున్నది.

ప్రభా—మాటాడరేమి? మీరుమంచివారు; మోసంచెయ్యరు; నావుంగరమైనా చంద్రహారమయినా యేదోవకటి యియ్యండి.

చిన్నవ—ఓసి శిఖండీ! నా దేహము మండుకొని పోవుచున్నది. మాటాడక వెళ్ళిపో—లక్ష్మణా! మనము వెళ్ళుదమురా.

చిన్నల—మంచివానికి మాటాడక పోవడమే మంచని కాలికి బుద్ధి చెప్పడం చూచినావా? (అని యిద్దఱును పరుగెత్తు చున్నారు.)

పరిభా—(తనలో) సందేహంలేకుండా వసంతకుడికి పిచ్చియెత్తింది; లేకపోతే యీ ప్రకారంగా మాట్లాడడు. నలభయిసరహాలుచేసే నావుంగరం పుచ్చుకొని దానికి బదులుగా చంద్రహారంయిస్తానన్నాడు! ఇప్పుడు రెండింట్లోయేదీలేదంటూవున్నాడు. ఇంతేకాకుండా మధ్యాహ్నం భోంచేసే టప్పుడు తన్ను లోపలికి రానియ్యకుండా తన యింటితలుపులు వేసినారని పిచ్చికథ వకటి చెప్పినాడు. యితనిపిచ్చ తెలుసుకుని పెళ్ళాము బుద్ధిపూర్వకముగానే తలుపులు వేయించియుండును. నేనిప్పుడు తిన్నగా అతనియింటికి వెళ్ళి పిచ్చిచేత నాయింట్లో ప్రవేశించి బలవంతముగా నావుంగరం యెత్తుకొని పోయినాడని పెళ్ళాముతో చెప్పిరస్తాను. యీసంగతి చెప్పితే నావుంగరం పోయినా దానివెల నలభయి వరహాలయినా వస్తవి. (అని వెళ్ళుచున్నది.)

---

చతుర్థరంగము—వసంతకుని గృహసమీపమున వీథి.

[పెద్దవసంతకుఁడును, ఒకరాజభటుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—నీవేమియు భియపడనక్కఱలేదు; నేనుపారిపోను; సాయం కాలము లోపల నేనియ్యవలసిన సొమ్మిచ్చి నిన్ను పంపెదను. ఈదినమున నాభార్య నామీఁద కొంచెము కోపముగా నున్నది; అందుచేత నేనుపంపిన వర్తమానము వేగిరము నమ్మ నదికాదు కాఁబోలును! ఈపట్టణములో రాజభటులు నన్ను ఋణము నిమిత్తమయి పట్టుకొన్నా రన్నమాట యీమె చెవులకు వింతగా వినఁబడి నమ్మ నర్హముకానదిగా నుండును.

[బెత్తముపట్టుకొని యింతలో పెద్దలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అదుగో నేను పంపిన సేవకుఁడు వచ్చుచున్నాఁడు; అతఁడు సొమ్ము తీసికొని వచ్చియుండును.—ఏమి? నేను తెమ్మన్నది తీసికొనివచ్చినావా?

పెద్దల—ఇదిగో బెత్తము తీసికొని వచ్చినాను. (అని యియ్యఁబోవుచున్నాఁడు)

పెద్దవ—ఇదికాదు. సొమ్మెక్కడ నున్నది!

పెద్దల—సొమ్ము నాదగ్గిరలేదు, బెత్తం కొన్నవాడి కిచ్చివేసినాను.

పెద్దవ—ఓరి భ్రష్టుఁడా! బెత్తముకొన్నవానికి నాలుగువందల రూపాయల మూట యిచ్చినావా?

పెద్దల—నాలుగువందలరూపాయల మాటయేమిటి?

పెద్దవ—నిన్నెందుకు పంపినాను?

పెద్దల—నన్ను బెత్తమునిమిత్తం పంపినారు; బెత్తం తెచ్చినాను.

పెద్దవ—తిన్నగా అడిగినమాటకు సదుత్తరము చెప్పనందు కిప్పు డీబెత్తము నీ వీపుమీఁద విఱుగవలెను. (అని కొట్టుచున్నాఁడు.)

రాజభటుఁడు—మీరు కోపమాని శాంతం వహించవలెను.

పెద్దవ—ఆపదలో నున్నవాఁడను నేనా శాంతము వహించవలసినది?

పెద్దల—ఏమిటండీ? అలాగు—

రాజభ—వూరుకో; నోరుముయ్యి.

పెద్దల—నామీద కోపపడకపోతే ఆయనను కొట్టకుండా చెయ్యరాదా?

పెద్దవ—మొండిశిఖండీ! పరమ నిర్భాగ్యుఁడా! నీకు తెలివిలేదురా!

పెద్దల—నాకు తెలివి తప్పివుంటే యీదెబ్బలు తెలియకనైనా పోను.

పెద్దవ—నీకు దెబ్బలు తగిలినవని తెలిసికొనుటలో తప్ప మఱియెందులోను నీకు తెలివిలేదు. నీవు గాడిదవు.

పెద్దల—నేను గాడిదనే; యెంతవోర్పుగలిగి పనిచేస్తూవున్నా నాకు దెబ్బలు తగులుతూ వుండడంచేత నేను గాడిదనే.

[సీతయు, సుభద్రయు, ప్రభావతియు, దుర్గాదాసను మాంత్రికుఁడును
ప్రవేశించుచున్నారు;]

పెద్దవ—అదిగో నాభార్య వచ్చుచున్నది; ఎదురుగా వెళ్లుదము రండి.

పెద్దల—అమ్మా! చేతిలో బెత్తంచూచి జాగ్రతగా వుండు; దగ్గిరకు వస్తేనా దెబ్బలు తగులుతవి. నాజ్యోతిషంనమ్మి దూరంగా వుండు.

పెద్దవ—నీవింకను నోరుమూసికొనవా? (అని కొట్టుచున్నాఁడు.)

ప్రభా—నీవిప్పుడేమి చెపుతావు? నీ మొగుడు పిచ్చివాడవునాకాడా?

సీత—ఆయన చేస్తూవున్న దురాగ్రహంచూస్తేమరివకలాగునూహించ డానికివీలు లేకుండావున్నది—దుర్గాదాసుగారూ! మీరు మంత్రవేత్తలుగదా? నాపెనిమిటిని పట్టుకున్న భూతాన్ని వదిలించి యథాప్రకారం వుండేటట్లు చేస్తిరా మీకు మంచి బహుమానం చేస్తాను.

సుభ—యెంతవికారంగా మనకేసి యెఱ్ఱబారి చూస్తూవున్నాఁడో చూడు.

ప్రభా—అతికోపంచేత యేలా వణకుతూ వున్నాడో చూడు.

దుర్గా—నీచెయ్యి నాచేతికిచ్చి నాడిచూడనీ.

పెద్దవ—ఇదిగో చేయి చూడు. (అని చేయిచాపి) అవకతవకమాటలు పేలిన పశువువా, ఈ చెయ్యి నీదౌడ శుద్ధిచేయును. జాగ్రత్త.

దుర్గా—చేతులో భూతశాడి ఆడుతూవున్నది. ఈమన దేహాన్నాశ్రయించి యున్న ఓ భూతమా! శీఘ్రముచెప్పి వేగిరం వదలిపో. వేగిరం వదలి వెళ్ళని పక్షానికి నా మంత్రశక్తిచేత నిన్ను సీసాలోదించి మార్జనహోమం చేస్తాను.

పెద్దవ—ఊరుకో, దయ్యాలపోతా! వూరుకో. నాకు పిచ్చియెత్తలేదు.

దుర్గా—నేనెరుగుదును; మీకుపిచ్చికాదు; మీదేహాన్ని గ్రహంసోకియిలాబాధ పెడుతూవున్నది. త్రిపురసుందరినైనా, భ్రమరాంబనైనా, జ్వాలానృసింహమునైనా, శరభసాళ్వమునైనా ప్రయోగించి నిమిషంలో మీకు గ్రహబాధ లేకుండాచేస్తాను.

పెద్దవ—ఓసి పరమచండాలురాలా! వీరరదయును నీకిప్రకారముగా బోధించి నిన్నిక్కడకు తీసికొనివచ్చినారా? ఈయేమున్న మొగపు నిర్భాగ్యరాలు తలుపులు బిగించివేసి నన్ను లోపలికి రానియ్యక ఎవనినో లోపల పెట్టుకొని సిగ్గులేక నాయింట నేప్రకారముగా భోజనము చేసినది?

సీత—ఓప్రాణనాథా! ఈమధ్యాహ్నం నీవు నాతోకలిసి మనయింట్లోభోంచేసిన సంగతి భగవంతుడికి తెలుసును; నాకు తెలుసును.

పెద్దవ—ఓసి సిగ్గుమాలినదానా! ఏమనుచున్నావు! నీయింట భోజనము చేసానా?

పెద్దల—స్వామీ! నేను నిజం చెపుతాను. మీరు యీదినం యింటికాడ భోజనం చెయ్యలేదు.

పెద్దవ—ఇంటితలుపులు వేసివెయ్యలేదా?

పెద్దల—అవును వేసివేశారు. నేను కళ్ళారా చూచినాను.

పెద్దవ—మన మెంత పిలిచినను తలుపు తియ్యలేదుకాదా?

పెద్దల—అవును మనం యెంతపిలిచినా తలుపుతియ్యలేదు.

పెద్దవ—లోపలినుండికూడ నెవ్వరో తలుపుతీయవలదని కేక వేసినారుకారా?

పెద్దల—అవును లోపలినుంచికూడా యెవరో తలుపుతియ్యవద్దని కేకవేశారు. నేను చెవులార విన్నాను.

పెద్దవ—గుమ్మముదగ్గ కావలియున్నవాడు నన్ను తిరస్కరించి కానిమాట లాడలేదా?

పెద్దల—[illegible] మాట లాడినాడు.

పెద్దవ—నాకందుచేత కోపమువచ్చి గిరుక్కునమరలి నేనక్కడనుండి మరి యిక చోటికి పోలేదా?

పెద్దల—అవును అక్కడనుంచి తత్తరగా పరుగెత్తివచ్చి వెళ్ళగొట్టినారు. అదంతా నికి నావళ్ళంతా సాక్ష్యం యిస్తూవున్నది. భార్యాగారిమీదవల్లనే నావంటిమీద యెక్కడపడితే అక్కడల్లా కనపడుతూవున్నది.

సీత—ఈ అబద్ధాలలో నీవుకూడా యేకంకావడం కూడునా?

దుర్గా—వాడికి సిగ్గూబిడియమూ లేదు. యజమానుణ్ణి పిచ్చివాణ్ణి చేసి యెంత ఆడిస్తూవున్నాడు.

పెద్దవ—కంసాలివాడు నన్ను పట్టుకొనునట్లు చేయుటకు నీవు వానికి సహాయురాలవయినావా?

సీత—అయ్యో! నేనేపాపమూ యెరగను. ఇంకా మీరు నగల పెట్టెలో వున్న రూపాయలమూట యిమ్మన్నారని లక్ష్మణుడు వగరుస్తూ పరుగెత్తుకొనివస్తే మిమ్మల్ని విడిపించడానికి వెంటనే సొమ్మిచ్చి పంపినాను.

పెద్దల—నాచేతికి సొమ్మా! నాచేతికి చిల్లిగవ్వ యివ్వలేదు—యీవిడ అన్నీ అబద్ధాలే ఆడుతూవున్నది. అయ్యా! ఈవిడ మాటలేమీ నమ్మబోకండి.

పెద్దవ—నీవు సొమ్ము నిమిత్తమయి యింటికి వెళ్ళనైన వెళ్ళినావా?

సీత—వీడు నాదగ్గరకువచ్చి అడిగినాడు; నేను సొమ్ము వీడి చేతిలో పెట్టినాను.

సుభ—నేను చూస్తూవుండగా సొమ్ము వీడిచేతికిచ్చింది. నేనే పెట్టెతాళంతీసి రూపాయలమూట తీసికొనివచ్చినాను.

పెద్దల—ఓ స్వామీ! నేను యేమీ యెరగను. నన్ను బత్తెం కావడానికి తప్ప మరెక్కడికీ మీరు పంపలేదు. నాకు దేవుడూ బత్తెంయిచ్చినవాడూ తప్ప మరియెవరూ సాక్షులు లేరు. ఆడవాళ్ళు అబద్ధాలాడతారు; వాళ్ళను నమ్మరాదు.

దుర్గా—అమ్మా! నీకేపిచ్చయేమిటి? యజమానుడికీ సేవకుడికీ యిద్దరికీకూడా పైత్యంపట్టింది. వాళ్ళ చూపులవల్లనే నాకంతా తెలిసింది. వీడిద్దరినీ పట్టుకొని చేతులూకాళ్ళూకట్టి చీకటిగదిలో పెట్టవలెను.

పెద్దవ—ఈదినము నీవు నన్నెందుకు తలుపువేసి లోపలకురానిచ్చినావుకావు?— ఓరీ! నీచేతికిచ్చిన సొమ్ము నీవెందుకు తీసికొనివచ్చి యిచ్చినావుకావు?

సీత—పరమేశ్వరా! నిన్ను వెలపలపెట్టి నేనెంతమాత్రమూ తలుపు వేయించలేదు.

పెద్దల—స్వామీ! నిజంగా నే యీమె సొమ్ము నాచేతికియ్యలేదు. మనయింటికి వెళ్ళినప్పుడు తలుపు వేయించినదని నేను నిజంపక్షంలో పలకలేదా?

సీత—ఓరి పంచమహాపాతకుఁడా! నీవు రెండుసంగతులలోనూకూడా ఘోర మయిన అబద్ధమాడుతూవున్నావు.

పెద్దవ—ఓసి మాయలమారితొత్తా! అన్నిసంగతులలోను నీ వబద్ధమాడు చున్నావు. నడివీధిలో నన్నవమానపఱచుటయేకాక మీఁదిమిక్కిలి వీండ్రనందఱిని కూడుకొనివచ్చి, సిగ్గులేక నాకేసి తేటిపాటుచూచుచున్నావా? ఈరెండుచేతులతోను నీగుడ్లు రెండును నూడఁదీసి క్రిందపెట్టెదను. (అని మీఁదికి వచ్చుచున్నాఁడు. అప్పు డిద్దఱుతుగ్గరతనిని పట్టుకొనుచున్నారు.)

సీత—పట్టుకోండి; పట్టుకోండి; నాదగ్గిరకు రానియ్యకండి; కట్టిపెట్టండి.

దుర్గా—ఘాతావేశంచేత మాయిద్దరికీ లొంగకుండావున్నాఁడు. మీరుకూడా సహాయుండండి.

సుభ—అయ్యో! పాపము! అతఁడేప్రకారంగా తెల్లపోయి వికారపుమాపు చూస్తూవున్నాడో!

పెద్దవ—ఏమిసూరంచయిందు జేరినన్ను హత్యచేసెదరాయేమి?—ఓరాజభటుఁడా! నీకావలిలోనున్న నన్ను వీండ్రందఱును కొట్టివిడిపించి తీసికొనిపోవుచుండఁగా చూచుచు నూరకుండెద వేమి?

రాజభ—అయ్యో! మీరీయనను వదలిపెట్టండి. నాకాపుదలలో వుండఁగా మీరీయన నెవ్వరూ ముట్టుకోకూడదు.

దుర్గా—ఇతనికికూడా వఱ్ఱు తెలియకుండావున్నది;యితణ్ణికూడా పట్టుకొని కట్టిపెట్టండి. (ఇద్దఱు లక్ష్మణుని కట్టుచున్నారు.)

సీత—ఓయిరాజభటుఁడా! నీవెందుకడ్డంవస్తావు? పిచ్చివాఁడిప్రకారంగా బాధపడుతూ అందరినీ కొట్టఁబోతూవుంటే చూడడానికి నీకుసంతోషంగావున్నదా యేమిటి?

రాజభ—ఈయన నాకావలిలోవున్నాఁడు; ఈయనను వదలిపెట్టితే యీయన బాకీవున్నసొమ్ము నేను యివ్వవలసి వస్తుంది.

సీత—బాకీమొత్తంయెంతో చెప్పినపక్షమును నేనుయిచ్చివేస్తాను;ఆవిషయంలో నీవేమీ జడియనక్కరలేదు. నాతో యింటికిరా.—ఓభూతవైద్యుఁడా! నీవుకూడా వెళ్ళి యీయనను భద్రంగా లోపలిగదిలో పెట్టించు. ఈరోజు మాకు గొప్ప దుర్దినము.

పెద్దవ—ఓసిపాపాత్మురాలా!

పెదల—సీమాలంగా నన్నుకూడా కటిపెటినారు.

పెద్దవ—చండాలుఁడా! నీవే నాకు పిచ్చియెత్తించుచున్నావు.

పెద్దల—వృథాగా మిమ్మల్ని కట్టిపెట్టి తీసుకొని వెళుతూవుంటే లోబడివూరుకుంటూరా? ఇదివరకు పిచ్చిలేకపోయినా యిప్పుడు పిచ్చియెత్తించుకొని యీ దయ్యాలన్నీ హడిలి పారిపోయేటట్టు కేకలు వెయ్యండి.

సుభ—పాపము! యెంత అసందర్భంగా మాట్లాడుతూవున్నారూ! వీరినిద్దరినీ దైవం రక్షించును గాక!

సీత—మీరియిద్దరినీ యింటికి తీసుకువెళ్ళండి.—సుభద్రా! నీవునాతో వుండు.
(దుర్గాదాసును, సహాయులును, పెద్దవసంతకుఁడును, పెద్దలక్ష్మణుఁడును వెళ్ళుచున్నారు.)

సీత—ఓయీ! యెవరిబాకీనిమిత్తం యీయనను పట్టుకున్నారు?

రాజభ—ఎవరో విశ్వకర్మ అనే కంసాలి బాకీనిమిత్తం. నీవాయనను యెరుగుదువా?

సీత—యెరుగుదును. బాకీమొత్తంయెంత?

రాజభ—నూఱువరహాలు.

సీత—ఆసొమ్ము యెందుకోసంబాకీవున్నారు?

రాజభ—నీ పెనిమిటి చేయించిన చంద్రహారంనిమిత్తం.

సీత—ఆయన నాకోసం చంద్రహారం చేయిస్తూవున్నానని చెప్పినారుగాని తీసుకొనిరాలేదు.

ప్రభా—నీమొగుడు మధ్యాహ్నం కోపముతో మాయింటికివచ్చి నావుంగరం పట్టుకొని వెళ్ళినాడు. ఇప్పుడాయన వేలినివున్నది ఆవుంగరమే ఆయనను వీధిలో చూచినాను.

సీత—అయివుండును. నేనుమాత్రం చంద్రహారం చూడలేదు.—ఓభటుఁడా కంసాలి యెక్కడవున్నాడో నావద్దకు తీసుకునిరా. నిజం అతనివల్ల కనుక్కొనిసొమ్ము యిచ్చివేస్తాను.

[చేతిలో కత్తితో చిన్నవసంతకుఁడును, చిన్నలక్ష్మణుఁడును
ప్రవేశించుచున్నారు.]

సుభ—హా! దైవమా! రక్షించు. వాళ్లు మళ్లీవదల్చుకొని వీధినిపడ్డారు.

సీత—ఈసారి కత్తులుదూచుకొని వచ్చినారు. వారిని మళ్లీ పట్టుకొని కట్టిపెట్టడానికి సహాయంరమ్మని అందరినీ పిలవండి.

రాజభ—పారిపొండి. వాళ్ళిద్దరూ మనను చంపివేస్తారు. (రాజభటుఁడును, సీతయు, సుభద్రయూ, పారిపోవుచున్నారు.)

చిన్నవసం—మనకత్తులు చూచి వారు బెదరినారు.

చిన్నల—యిందాకా మిమ్మల్ని మొగుడని వెంబడించినది యిప్పుడు కాడిలి మీవద్దనుంచి పారిపోతూవున్నది.

చిన్నవసం—ఇంక మనకు భయములేదు. సత్రమువద్దకువెళ్ళి మనసామానుపట్టు కొనిరా. ఈరాత్రి బండియెక్కి వెళ్ళిపోవచ్చును.

చిన్నల—యీరాత్రికి మనం యిక్కడవున్నా వుండవచ్చును. వాళ్ళు మన కేమీ కీడుచెయ్యరు. వాళ్ళు మనతో అనుకూలంగా మాట్లాడుతూ వున్నారు; మనకు బంగారం యిస్తూవున్నారు. యీవూళ్ళోవాళ్ళందరూ నాకుబహుమంచివాళ్ళుగాకన పడుతూవున్నారు. నన్ను మొగుడనిపట్టుకొన్న ఆగ్రామదేవత మూలంగా గాని లేక పోతే యెల్లకాలమూ నాకూ యీవూళ్ళోనే వుండవలెనని వున్నది.

చిన్నవసం—మనకులక్షవరహాలువచ్చినను నేనీరాత్రి యీగ్రామములోనుండను. మనసామాను పట్టించుకొని వత్తమురా.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు.)

---

## పంచమాంకము.

---

ప్రథమరంగము—మఠసమీపమునవీధి.

[వర్తకుఁడును, విశ్వకర్మయు ప్రవేశించుచున్నారు.]

విశ్వ—నామూలంగా మీప్రయాణం నిలిచిపోయినందుకు బహు విచారంగా వున్నది. అతడు శుద్ధ అన్యాయానికి వడిగట్టి యివ్వలేదంటూవున్నా నేనతనిచేతికి చంద్రహారం యిచ్చినానని ప్రమాణంచేసి చెప్పగలను.

వర్త—అతనికి యీపట్నంలో అంత గౌరవం యెందుచేతవచ్చినది?

విశ్వ—అందరున్నూ అతణ్ని బహుగౌరవంగా చూస్తారు; అతనుమహామంచివాడు; అబద్ధమన్నమాట అతనినోటినుంచి రాదు; అతనిపేరుచెపితే యెంతపరపతి ఐనా పుడుతుంది. యీగ్రామంలో అతనితోసమానులు మరియెవరూలేరు. యేరాత్రివేళ యేమనిషిచేత అతడు కాస్త వర్తమానంపంపినా తమధనంఅంతా అతణ్నినమ్మి పంపే టంత గురి అందరికీ అతనియందు వున్నది.

వర్త—మెల్లగామాట్లాడు; అదుగో అతఁడు వస్తూవున్నాఁడు.

[చిన్నవసంతకుఁడును, చిన్నలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

విశ్వ—అవును. అతఁడు తనకియ్యలేదని ప్రమాణముచేసిన దాచంద్రహారమే. అతఁడు దగ్గరకురానీ; అడుగుతాను.—ఓవసంతకా! నా కీఅవమానమున్నూ శ్రమమున్నూ యెందుకు కలగచేసినావో నాకు అద్భుతంగావున్నది; ఇప్పుడు మీరు యింత బహిరంగంగా మెడలోవేసుకుని వీధిలో తిరుగుతూవున్న యీచంద్రహారము లేదనడము మీకుమాత్రం సిగ్గుచేటుకాదా? నన్ను వృథాగా నలుగురిలోనూ పరాభవపరచడమే కాకుండా యీపెద్దమనిషికికూడా లేనిపోని ఆయాసం కలుగచేసినారు. మనవివాదమూలంగా గాని లేకపోతే యీయన యీపాటి ప్రయాణమయి వెళ్ళివుందును. నావద్ద పుచ్చుకున్న చంద్రహారం యిది యిప్పుడు మీరు లేదనఁగలరా?

చిన్నవసం—అవునిది నీవే నాచేతికిచ్చినావుకాఁబోలును! నీవియ్యలేదని నేనెప్పుడును అనలేదే.

వర్త—అవును మీరు లేనన్నారు; లేదని అప్రమాణంకూడా చేసినారు.

చిన్నవసం—నేను లేదనుచుండఁగాఁ గాని ప్రమాణం చెయ్యఁగాఁ గాని యెవరువిన్నారు?

వర్త—నాయొక్క యీరెండుచెవులున్నూ విన్నవి. ఇఁక మాటాడకపూరుకో పెద్దమనుషులలో తిరగనేర్చినవాడవు యిటువంటి అబద్ధమాడి సిగ్గులేకుండా తిరుగుదువని యెలాగు వీధులో తలయెత్తుకుని తిరుగుతూవున్నావు?

చిన్నవసం—నామీఁద అటువంటి దోషారోపము చేయుటచేత నీవు పచ్చి దొంగవుగా కనఁబడుచున్నావు. మగవాఁడవయి నీవు నాతో దెబ్బలాటకు వచ్చిన పక్షమున, నాయథార్థతయు మర్యాదయు నీకు నిమిషములో కనఁబఱచఁగలను.

వర్త—తిరిగితే మొగంమీద చెప్పు. నీవంతకంటెను దొంగవని నేను రుజువు పరుస్తాను.

(వారు దగ్గఱకు వచ్చుచున్నారు.)

[సీతయు,సుభద్రయు, ప్రభావతియు, మతికాంతయును ప్రవేశించుచున్నారు.]

సీత—ఆగు—అతనికేమీహాని చేయకు—అతఁడుపిచ్చివాఁడు—కొందఱుమీరందరికి వెళ్ళి చేతులోకత్తి లాగుకోండి—లక్ష్మణున్నికూడా పట్టుకొని కట్టిపెట్టి యిద్దరినీ మాయింటికి తీసుకునిరండి.

చిన్నల—అమ్మాయి! పరుగెత్తుపరుగెత్తు. అదుగోమఠం. అందులోదూరి తలుపులు లోపల వేసుకుందాము, లేకపోతే వీళ్ళు మనని బ్రతకనియ్యరు.

(చిన్నలక్ష్మణుడును, చిన్నవసంతకుడును, మఠములోనికి వెళ్ళుచున్నారు.)

[మఠములోనుండివచ్చి యోగిని ప్రవేశించుచున్నది.]

యోగిని—జనులారా! అల్లరిచేయకండి. మీరిక్కడ యెందుకు గుంపుగా చేరినారు?

సీత—మతిచాంచల్యం కలిగినవానినిమిటిని యిక్కడనుంచి తీసుకువెళ్ళడానికి మమ్మల్ని లోపలకు రానీ. మేమతణ్ణి గట్టిగాకట్టిపెట్టి వైద్యంచేయించడానికియింటికి తీసుకుపోతాము.

విశ్వ—ఈయనకు మతి చలించినదని యిదివరకే అనుకున్నాను.

వర్త—ఈయనతో దెబ్బలాటకుసిద్ధమయినందుకునాకిప్పుడువిచారంగా వున్నది.

యోగిని—యెంతకాలంనుంచి యితఁడీస్థితిలో వున్నాఁడు?

సీత—వారం దినములనుంచి యీయన పరధ్యానంగానూ, విచారంగానూ వ్యాకులంగానూవుండి వెనుకటికంటె యేమోభేదంగా కనిపిస్తూ వచ్చినారు. కాని యీరోజువరకూ యింతచేటులేదు. మరి యీమధ్యాహ్నంనుంచీ వొళ్ళు తెలియకుండా తిరిగిపోయినారు.

యోగిని—అకస్మాత్తుగా యితనిధనమేమయినా విస్తారంగా పోయిందా? ఎవరైనా ప్రాణమిత్రుడు కాలంచేసినాడా? ఇతనిదృష్టి యేమైతేమీదికైనా పారి అక్రమంగా పరస్త్రీకోసం పరితపిస్తూవున్నాఁడా? వయస్సులోవున్నవాళ్ళు అందగత్తె అయిన క్రొత్తదాన్ని చూడడంతోనే దానిమీద కన్నువేసి సాధారణంగాపిచ్చియెత్తి తిరుగుతూవుంటారు. ఈమూడింట్లో నీమెుగుడి పైత్యభ్రమకు యేదికారణమయి వుండవచ్చును?

సీత—వకవేళ అయితే నీవు కడపటచెప్పినదితప్ప మరియేదీ కారణమయి వుండదు. ఈయన తరుచుగా యింటికాలస్యంగా వస్తూవుండడంచేత యెవతెవలలోనో పడి యిల్లూవాకిలీ మరిచి తిరుగుతూ వున్నాడని వూహిస్తాను.

యోగి—ఆపనిచేసినందుకయి నీవతణ్ణి కూకలువెయ్యవలిసింది.

సీత—నేనుమాత్రమూరుకున్నానా? కూకలువేస్తూనేవున్నాను.

యోగి—నీవు తగినంతగట్టిగా కూకలువేసినట్టు తోచదు.

సీత—భార్య మెుగుణ్ణి కూకలువెయ్యతగినంత గట్టిగా కూకలువేస్తూనే వచ్చినాను.

యోగి—వకవేళ రహస్యంగా కూకలువేసేదానవు కాబోలును!

సీత—రహస్యంగా మాత్రమేకాదు; బహిరంగాకూడాను.

యోగి—అయితే చాలినంతకాదు.

సీత—అలాగయితే నిజంచెప్తాను. ఇఖ ఆయనతో నాకు రెండోప్రసంగం లేదు. రాత్రిపరున్నప్పుడు నిద్రపట్టిందాకా చెవిదగ్గిరచేరి యీసంగతే నేగొణుగుతూ వుండేదాన్ని; భోజనమువద్దకూడా యీసంగతి చెప్పకుండా ముద్దమింగనిచ్చేదాన్ని గాను; మేమిద్దరమూ వంటిగావుంటే యిదితప్ప మరివకసంగతి మాటాడేదాన్ని కాను; అతడు పదిమందిలో వుండేటప్పుడయినా యీథోరణే తెచ్చి తుత్తిపాడుపుమాట లంటూనే వుండేదాన్ని. నేను యెప్పుడూ యీవిషయమయ్యే చీవాట్లు పెడుతూ వుండేదాన్ని.

యోగి—నీవాడే మాటలమూలంగానే నీమొగుడికి పిచ్చియెత్తింది. లేనిపోని అనుమానం పెట్టుకొని అహోరాత్రములు చెవిదగ్గిరచేరి విరామంలేకుండా సాధిస్తూ వుండే భార్యమాటలు పెట్టికుక్క—కాటుకంటెనూ యెక్కు—వవిషంగావుండి యెటువంటి పరమశాంతునకయినా నిమిషంలో పిచ్చియెత్తిస్తవి; నీపోరుచేత అతడు రాత్రి నిద్రకుకూడా మొగంవాచినట్టు తోస్తుంది; రోజూ కలతనిద్రపోయేవాడికి మతి చలించిపోవడం అంతఆశ్చర్యంకాదు; నీవాడేమాటలతో తిన్నఅన్నం కడుపునపట్టక నీరయిపోయివుండును. ఈప్రకారం నిద్రాహారాలులేక యిల్లు అడివిగా నున్నప్పుడు రోగాలూ యెందుకు రాకుండావుంటవి? జారత్వశంకచేత యిదంతా నీవుచేసుకున్నదోషఫలమే కాబట్టి స్వయంకృతాపరాధము నీది నీవే అనుభవించవలెను.

సుభ—అతడుయెంతఅక్రమంగా ప్రవర్తిస్తూ వచ్చినాగానీ మాఅప్పమాత్రం అతణ్ని మంచిమాటలతోనే బోధిస్తూవచ్చినది; అంతేగాని తూలుమాట యెప్పుడూ నోటరానిచ్చేలేదు—(మెల్లగా)ఆమెతప్పితమంతా నీమీదవేసూపి చీవాట్లు పెడుతూ వుంటే బదులుచెప్పకుండా వూరకుంటావేమి?

సీత—(మెల్లగా)ఆమెఅంతా నానోటనేపలికించినన్నునోరెత్తకుండాచేసింది; నేనేమిచెప్పగలను? (బిగ్గరగా)—మీరు లోపలికివెళ్ళి అతణ్ని పట్టుకోండి.

యోగి—మీరు యెవరూ లోపలికి వెళ్ళకూడదు.

సీత—అలాగయితే మీవాళ్ళ నెవళ్ళనయినా నాపెనిమిటిని యికతలకు తీసుకునివచ్చి నాకువప్పగించమను.

యోగి—అదీవల్లకాదు. ఇది పవిత్రమయిన మఠంగనుక అతడు దీనిలోప్రవేశించినాడు; అందుచేత నేను అతణ్ని మంచిమాటలతో స్వస్థచిత్తుణ్ని చేసేవరకూ నీకు వప్పగించను: నాప్రయత్నం వ్యర్థమయితే అప్పటిమాట చూస్తాను; యీలోగా వదిలిపెట్టను.

సీత—నా పెనిమిటికి పరిచర్య చెయ్యడం నాకు విధిగనుక, నా పెనిమిటి దగ్గిరే నేనే కనిపెట్టుకొనివుండి స్నేహపక్వపానాదులు పెట్టి వుపచారం చేస్తాను; మరివకరిని నమ్మి నేను అతణ్ని విడిచిపెట్టను; కాబట్టి అతణ్ని నన్ను యింటికి తీసుకువెళ్ళనీ.

యోగి—కొంచెం శాంతించు. అతణ్ని మళ్లీ యెప్పటిమనిషిని చెయ్యడానికి మందులూ గుళికలూ మంత్రాలూ అన్నీ ప్రయోగించి నా శాయశక్తులా పనిచేసే వరకూ నేను అతణ్ని విడిచిపెట్టను. యోగినినిగనుక కష్టంలో వున్నవాళ్ళకు సహాయం చెయ్యడం నాకుధర్మము. అతణ్ని యిక్కడ నావశంలో వుంచి నీవు వెళ్ళిపో.

సీత—నా పెనిమిటిని విడిచిపెట్టి నేను వెళ్ళను. మొగుణ్ని పెళ్ళాన్ని యెడబాపడం నీవంటి పుణ్యవ్రతంలో ప్రవేశించినదానికి ధర్మంకాదు.

యోగి—నేనతణ్ని వదిలిపెట్టను; మాటాడక వెళ్ళిపో. (అని లోపల తలుపు వేసికొనుచున్నది.)

సుధ—యీ అన్యాయం నీవు రాజుతో వెళ్ళి మొఱపెట్టుకో.

సీత—వెళుదాము రా. నేను ఆయన కాళ్ళమీద సాష్టాంగపడి, నా ప్రార్థనల వల్లనూ కన్నీళ్ళవల్లనూ ఆయనమనసు కరిగించి స్వయంగా యిక్కడకువచ్చి యీ యోగిని చేతులలోనుంచి నా పెనిమిటిని విడిపించి యిచ్చేవరకూ కాళ్ళమీదనుంచి లేవను.

వర్త—యిప్పుడు దగ్గిరదగ్గిరగా అయిదుఘంటలు కావచ్చింది. యింకా కొంచెం సేపటికి యీమఠం వెనకాలవున్న వధ్యభూమికి వెళ్ళడానికి రాజుగారు స్వయంగా నే యీదారిని వస్తారు.

విశ్వ—యెందుకోసము?

వర్త—యీపట్నంలోని శాసనాలకు విరుద్ధంగా యీవూరికి వచ్చినందునకయి ఒక మధురాపురపు వర్తకుణ్ని ముసలవాణ్ని వురితీయించడానికోసము.

విశ్వ—అదుగో వారువస్తూవున్నారు. అతణ్ని వురితియ్యడం మానుచుతారు.

సుధ—రాజు యీమఠం దాటి వెళ్ళకముందే నీవు ఆయన పాదాలమీద పడు.

[ధర్మపాలమహారాజును, సేవకులును, వర్ధమానుడును, కారాగృహాధికారియు, రాజభటులును ప్రవేశించుచున్నారు.]

ధర్మ—'ఏధర్మాత్ముడయినను వచ్చి యీతని ప్రాణరక్షణార్థము ధనమిచ్చి పుణ్యము కట్టుకొన్న పక్షమున, ఈతనిని విడుదల చేయుదుము' అని మతియొకసారి గట్టిగా చాటించుము. మనమీతని కీపాటియుపకారమును జేయుదము.

సీత—మహాప్రభో! యీ యోగిని నాకుచేసిన అన్యాయం విచారించి నాకు న్యాయం దయచేయించవలెను.

ధర్మ—ఆమె మిక్కిలి పుణ్యాత్మురాలు; బహుభాగ్యురాలు; నిరపరాధురాలు. ఏమియు అక్రమము చేసియుండదు.

సీత—ఓ మహారాజా! అనుగ్రహించి నా మొరాలకించండి. నాసంకేతుఁడుగారు నాకుభర్త, యేలినవారుచేసిన నమ్మకములనుబట్టి నేనాయనను వివాహంచేసుకున్నాను; నాదురదృష్టంచేత ఆయనకు యీరోజున అధాత్తుగా పైత్యభ్రమ కనిపించి మాకుటుంబానికంతా గొప్పవిపత్తు సంప్రాప్తమయింది. ఏమికాలకర్మదోషంచేతనోకాని తనతో పాటు యేకకాలమందే పిచ్చియెత్తినతన సేవకుణ్ని వెంటవేసుకొని ప్రాణమీదబడి ఆయన కనపడ్డయిల్లెల్లా దూరి వుంగరాలూ నగలూ చేతికి యేదిదొరికితే అదెల్లా యెత్తుకువస్తూ అందరికీ అక్రమంచేస్తూవున్నారు. ఒకపర్యాయం నేను ఆయనను కట్టిపెట్టించి యింటికిపంపించి, అదివరకాయన అక్కడక్కడచేస్తూవచ్చిన నష్టానికి సొమ్ము సవరించి వారిని సమాధానపరుస్తున్నాను. ఆయన యేలాగోకాని తప్పించుకొని మళ్లీ వీధినిబడి తనసేవకుడున్నూ తానున్నూ కత్తులు దూసుకొనివచ్చి మమ్ముతరిమినారు. తరువాత మేము చాలామందిని సహాయంచేసుకొనివచ్చి మళ్లీ కట్టిపెట్టడానికి వెంబడించేవరకు వారు పరుగెత్తుకొనిపోయి యీమఠంలో పడ్డారు. మేమాయనను యింటికి తీసుకొనిపోదామంటే యీయోగిని మాకడ్డంవచ్చి తలుపులోపలవేసినది. ఆమె లోపలికి వెళ్ళనూవెళ్ళనియ్యదు; తానాయనను యివతలకు పంపనూపంపదు. దీనుల మయిన మామొఱ్ఱాలకించి దేవరవారేలాగయినా ఆమెవారిని యివతలికిపంపేటట్లు ఆజ్ఞ చేసి పతిభిక్షపెట్టి రక్షించవలెను.

ధర్మ—విస్తారకాలముక్రింద నీభర్త మాయొద్ద నొక సేనానాయకుఁడుగా నుండి మాకు మిక్కిలి యుపకారముచేసినాఁడు. అప్పుడు నిన్నతనికి వివాహము చేయించి మేముచేయఁదగిన ప్రత్యుపకారమంతయుఁజేసి మేమాతనిని బహువిధముల గౌరవించినారము—మీలోకొందఱు వెళ్ళి మఠద్వారముకడ్డనిలుచుండి పిలిచి యోగినిని మాయొద్దకు తీసికొనిరండు; మేమీతగవుతీర్చి మఱియిక్కడనుండి వెళ్ళెదము.

[ఒకపరిచారిక ప్రవేశించుచున్నది.]

పరి—అమ్మా! పరుగెత్తుకొనివెళ్ళి వేగిరం నీప్రాణాలుదక్కించుకో. అయ్యగారున్నూ సేవకుడున్నూ కూడా వదిలించుకొని, ఇంట్లోవున్న పరిచారికలందరిని కొట్టి, భూతవైద్యుణ్ని కట్టిపెట్టి గడ్డానికి నిప్పంటించినారు; అతఁడు కష్టంతోటి యేడుస్తూవుంటే అప్పుతానని మంగలినిగా బురదపోసికొట్టి నిప్పార్పినారు. మన యజమానుడు శాంతంమమని అతనికి బోధచేస్తూవుండగా, [illegible]

వచ్చి అతనితల లేవురేవ్వుటుగా గొరిగినాను. వెంటనే మీరు యెవరినైనా పంపితే నే తప్ప వారిద్దరూ చేరి మంత్రిగాణ్ణి చంపివేస్తారు.

సీత—ఓసిహిచ్చిదానా! నోరుముయ్యి. నీయజమానుకున్నూ సేవకుడున్నూ, యిక్కడ నేవున్నారు. నీవుచెప్పినదంతా అబద్ధం.

పరి—అమ్మా! మీతోడు. నేను నిజం చెపుతూవున్నాను. నామాటనమ్మండి, అతణ్ని నేనుచూచి యిన్నాగా నిముషమయినా అయివుండలేదు. ఆయననీపేరు పెట్టిపిలిచి యెక్కడ వున్నావని కేకలువేస్తూ, నీవు కనపడిన పక్షానికి నీముఖంనిండా గంట్లు పెట్టి నిన్ను విరూపిని చెయ్యకపోతే తనపేరు మారుపేరు పెట్టుమని వొట్టుపెట్టుకుంటూ వున్నాడు. (లోపల పెద్దవసంతకుఁడు కేక వేయుచున్నాఁడు.) అమ్మా! అలకించు! ఆలకించు. ఆయనమాటలు వినఁబడుతూవున్నవి. ఇక్కడ నిలువను; పరుగెత్తు.

ధర్మ—జడియకు. ఈలాగువచ్చి నీవు నావెనుక నిలుచుండు.—ఈ పెలు పుచ్చుకొని కాచుకొండి.

సీత—అయ్యో! అతఁడు నాభర్త. అతఁడు యెలాకనపడకుండావచ్చినాడో చూడండి. ఇంతకు మునుపు యితఁ డీమఠంలో ప్రవేశించడం చూచినాను; ఇప్పటప్పుడే అక్కడవున్నాఁడు; అతఁడు ఇప్పుడక్కడి కేలావచ్చినాడో వూహించడానికైనా వీలులేకుండా మహాద్భుతంగా వున్నది.

[పెద్దవసంతకుఁడును పెద్దలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—న్యాయము దయచేయుండి ఓమహారాజా! న్యాయము దయచేయుండి. చిరకాలముక్రిందట నాదేహమున నెత్తురువఱదలుగట్ట గొప్ప గాయములు తగిలినను సాహసముచేసి మీకడ్డపడి యుద్ధములో మీప్రాణములు కాపాడి మీ కుపకారము చేసినందుకయినను నాకు న్యాయము దయచేయుఁడు.

వర్ధ—(తనలో) మరణభీతివలన నామతిపోయియుండిన నేమోకాని లేకున్న వాండ్రిద్దఱును తప్పకుండ నావసంతకుఁడును లక్ష్మణుఁడును.

పెద్దవ—మహాప్రభూ! మీచాటున నిలుచున్నయిది నాకుచేసిన ద్రోహము విచారించి నాకు న్యాయము దయచేయుఁడు. దానిని మీరు నాకు భార్యనుగా దయచేయించినారు; అది నాకపకారము చేసి నన్ను గౌరవపఱిచినది; ఈదినమున నాకది చేసిన యవమానమును హానియును నింతంతయని చెప్పుట కలవి కానివి.

ధర్మ—నీకేమి యన్యాయము సంభవించినదో చెప్పుము, నీకుతప్పక న్యాయము దొరకును.

పెద్దవ—ఓమహాప్రభువా! ఈదినమున నేను లోపటికి రాకుండ తలుపులువేసి లోపల జారులను పెట్టుకొని హాయిగా విందారగించినది.

ధర్మ—అది గొప్పతప్పితమే సీతా! నీవాప్రకారముగా చేసినావా?

సీత—మహాప్రభూ! నేనటువంటి అపరాధమేమీ చేయలేదు. యీమధ్యాహ్నం నేనూ నాచెల్లెలూ కూడా కలిసి భోజనంచేసినాము.

సుభ—మాఅప్ప దేవరివారితో మనవిచేసిం దంతా సత్యము.

విశ్వ—ఓసిమాయలాడీ! మీరిద్దరూ అప్రమాణమే చేసినారు. ఈవిషయంలో యీపిచ్చివాఁడు చెప్పినదే వాస్తవం.

పెద్దవ—స్వామీ! నేను చెప్పినదంతయూ యథార్థము. నేనిప్పుడు త్రాగిమత్తుగొని యుండలేదు; కోపముచేత నోడలు తెలియకయుండలేదు; చాకుచిత్తోన్మాదమును గలిగి యుండలేదు. ఈదినము నేను భోజనమునకు రాకుండ ఇది తలుపులు లోపల గడియవేసినది. ఈకంసాలికూడ కుట్రలో చేరియుండని పక్షమున, ఇతఁడు నాతో నున్నాఁడుగనుక నాపక్షమున సాక్ష్యమియ్యవచ్చును. ఇతఁడు మాతోఁగూడ కొంతదూరమువచ్చి ప్రభావతి యింటివద్దకు చంద్రహారము తీసి కొనివచ్చెదనని చెప్పి తనయింటికి వెళ్ళినాఁడు; కాంచనగుప్తుఁడును నేనును గలిసి ప్రభావతియింటివద్ద భోజనముచేసినాము. మాభోజన మయినతరువాత నతఁడక్కడకు రానందున కొంతసేపు చూచి నేనతనికొఱకు వెళ్ళినాను. నేనితనిని వీథిలో కలిసికొన్నప్పుడు, ఈపెద్దమనుష్యుఁడుకూడ నితనితోనున్నాఁడు. అప్పుడే అసత్యవాదియైన యీస్వర్ణకారుఁడు నేనీదినమున తనవద్దనుండి చంద్రహారమును పుచ్చుకొన్నానని ప్రమాణముచేసినాఁడు; ఆచంద్రహారము నే నెఱుఁగనిసంగతి భగవంతునికి తెలియును, దానినిమిత్తమయి యితఁడు నన్ను రాజభటున కొప్పగింపఁగా, నేనులోఁబడి సొమ్మునిమిత్తమై నాసేవకుఁడైన వీనిని మాయింటికిఁ బంపినానుగాని వీఁడు సొమ్ముతేక వట్టిచేతులతో నే మరలవచ్చినాఁడు. నేనింటికివెళ్ళి సొమ్ముభటునివశమునిచ్చి పంపెదనని రాజపురుషులను సమాధానపఱిచి వచ్చుచుండఁగా త్రోవలో నాభార్యయూ, దాని చెల్లెలును, మఱికొంత అల్లరిమూఁకయు మాకెదురుపడిరి. వారు తమతో దుర్గాదాసను ఏముకలగూడువలెనున్న యొకజీవచ్ఛవమునుకూడ తీసికొనివచ్చిరి. ఆఁడపీనుఁగు తాను భూతవైద్యుఁడనని వేషమువేసికొని నానాడియు చూపులును పరీక్షించి నాకు భూతముసోఁకినదని అఱచినాఁడు. వెంటనే అందఱును నామీఁదపడి నన్ను కట్టిపెట్టి తీసికొనివెళ్ళి, నాకోసమునగుండ త్రాళ్ళువేసికట్టి మాయిద్దఱిని మాయింటనే [illegible]

దీకటిగదిలో పెట్టినారు. నేను పండ్లతోకొతికి కట్టు తెంపుకొని యీసంగతి మొఱ పెట్టుకొనుటకు తత్క్షణమే తెలిసినవారి దర్శనమునకు పరుగెత్తుకొనివచ్చినాను. ధర్మస్వరూపులయిన దేవరవారు నాకీదినమున సంభవించిన మానభంగమునకును క్రమమును తగిన ప్రతిక్రియ చేయవలెను.

విశ్వ—మహాప్రభూ! ఈయన యీరోజు యింటికాడభోజనంచెయ్యలేదనీన్ని యింటికలుపులు వేసివేసివారననీన్ని యింతవరకు మాత్రం నేను సాక్ష్యమియ్యగలను.

ధర్మ—అతఁడు నీయొద్దనుండి చంద్రహారమును పుచ్చుకొన్నాఁడా లేదా?

విశ్వ—పుచ్చుకున్నాఁడు మహాప్రభూ! ఈయనయిక్కడికి పరుగెత్తుకొనివచ్చినప్పుడు యీయన మెడలో చంద్రహారం వీరంపకూడా చూచినారు.

వర్త—అంగడిపీథిలో నీవు మొదట చంద్రహారం యెరగనని ప్రమాణంచేసిన తరువాత, నీవింగడుమును పే యిక్కడపుచ్చుకున్నట్టు మళ్లీనీనోటితో చెప్పుకోవడం నేను చెవులారా విన్నాను. అందుమీద నాకు కోపంవచ్చి నీతో యుద్ధమునకు సిద్ధం కాఁగా, జనులు మందునుజూచి నీవిమఠంలోదూరి యెలాగో గాఁడీచేత నీవామూలనుంచి ప్రత్యక్షమయినావు.

పెద్దన—ఈమఠ సమీపమునకు నేనెప్పుడును రాను లేదు; నీవు నాతోయుద్ధమునకు సిద్ధముకానులేదు. దైవసాక్షిగా నేను చంద్రహారము పుచ్చుకోను లేదు; నీవు నిష్కారణముగా నామీఁద దోషారోపణము చేయుచున్నావు.

ధర్మ—మీరందరును ఒకదానికొకటి సంపర్కించకుండ మాటాడుచున్నారు! మీరంపేఱును త్రాగియున్నారని నాకు సందేహముకలుగుచున్నది. ఇతఁడీయింటఁ ప్రవేశింపఁగా మీరు చూచియుండినపక్షమున, ఇతఁడిక్కడనేయుండి యుండును. ఇతనికి మతిచలనము గలిగియుండినయెడల, ఇతఁడింత శాంతతతో సహేతుకముగా మాటాడియుండఁడు. ఇతఁడింటికడ భోజనముచేసెనని నీవు చెప్పుచున్నావు; ఇంటివద్దభోజనము చేయలేదని యీకంసాలిచెప్పుచున్నాఁడు!-ఓరీ! నీవేమిచెప్పెదవు?

పెద్దలక్ష్మి—స్వామీ! యీయన యీదినం యీప్రభావతియింటివద్దనే భోజనం చేసినారు.

ప్రభా—ఈయన మాయింటికాడనే భోజనం చేసినారు; అప్పుడు నావేలియుంగరంకూడా పుచ్చుకున్నారు.

పెద్దనసం—అవు నీమాటనిజము. ఈమెయొద్ద నే [illegible] తీసుకొన్నాను.

శాసెంతమాజిపోయినను, నాదృష్టిమాత్రము నాకన్నులను విడిచిపెట్టక నీవు నాకోమారుఁడవని చూపుచున్నది. నేనెట్లు మఱియొకలాగున ననుకోఁగలను?

పెద్దవసం—నాతండ్రిని నేనెప్పుడును చూచియుండలేదు.

ధర్మ—కుమారా! నాలుగు సంవత్సరములక్రిందట నీవు నన్ను మధురాపురములో విడిచిపెట్టివచ్చినావు. ఒకవేళ నిట్టిదురవస్థలోనున్న నన్ను తండ్రియని యొప్పుకొనుటకు సిగ్గుచేత నీవిట్లనుచున్నావేమో!

పెద్దవ—ఈమహారాజును నన్నెఱిగిన వీరంపటులు చిరకాలమునుండి నేనిక్కడనే యున్నాననియు, నేనెప్పుడును మధురాపురమునకు వెళ్ళలేదనియు సాక్ష్యమియ్యఁగలరు.

ధర్మ—ఓయి వృద్ధుఁడా! పదియేను సంవత్సరములనుండి మేమీతనికి ప్రాపకులముగా నున్నాము. ఈకాలములో నీతఁడెప్పుడును మధురాపురమునకు వెళ్లియుండలేదు. వృద్ధత్వముచేతను కష్టములచేతను నీమతిపోయి నీవీలాగున భ్రమపడియుందువని మేమనుకొనియెదము.

[చిన్నవసంతకునితోను, చిన్నలక్ష్మణునితోను, యోగిని ప్రవేశించుచున్నది.]

యోగిని—ఓమహారాజా! అన్యాయం సంభవించినయీమనుష్యుణ్ణి రక్షింపుడు. (అందఱును జూచుటకు గుంపుకూడుచున్నారు.)

సీత—నాకిద్దఱు భర్తలు కనఁబడుతూ వున్నారు! నాకళ్లకు భ్రమగలిగినదా యేమి?

ధర్మ—వీరొకరికొకరు ప్రతిబింబములవలెనున్నారు. వీరిలో నిజమయినవాఁడెవఁడో యెవరు నిర్ణయింపఁగలరు?

చిన్నల—లక్ష్మణున్ని నేను. యీరెండోవాణ్ని అవతలకు పంపివెయ్యండి.

పెద్దల—నేను లక్ష్మణున్ని; నన్నిక్కడ వుండనియ్యండి.

చిన్నవ—మీరు వర్ధమానులా? లేక ఆయన ప్రతిబింబమా?

చిన్నల—ఓహో? నా పెద్దయజమానుఁడు! ఈయనను యీప్రకారంగా కట్టి యెవరిక్కడకు తీసుకువచ్చినారు?

యోగిని—యెవరు తీసుకువస్తేనేమి? నేనీయనకట్లు విడిపించి మళ్లీ భర్తను సంపాదించుకొంటాను. ఓపుణ్యాత్మా! పూర్వము చారుమతి అనే భార్యను వివాహం చేసుకుని ఆమెవల్ల యిద్దఱు కవలపిల్లవాళ్లను కన్న వర్ధమానులు మీరేనా? ఈచారుమతి నే. [illegible]

వర్మ—నేనెప్పుడు స్వప్నావస్థలో లేనిపక్షమున నీవు నిశ్చయముగా చారుమతివే. నీవు చారుమతివేయయినయెడల, అప్పుడు నీతోఁగూడ సముద్రములో తేలిపోయిన పుత్రుఁ డెక్కడనున్నాఁడో చెప్పు.

చారుమ—నన్నూ నాకొడుకునూ సేవకుఁడయిన లక్ష్మణున్నీ తెప్పపడవలో యెక్కించుకొన్న చేపలవాళ్లు దుర్మార్గము చేసి పిల్లలిద్దరినీ బలాత్కారంగా నాదగ్గరనుంచి తీసుకొనిపోయి యెవరికో అమ్ముకొన్నారు. తరువాత వారిస్థితి యేమైనదో నాకు తెలియదు. నేను చిరకాలం అక్కడవుండి తరువాత యీపట్టణము చేరి నాలుగేళ్ళనుంచి యీమఠంలో యోగినినిగా వున్నాను.

ధర్మ—ఇతఁడీ ప్రాతఃకాలమునఁ జెప్పినకథ యిప్పుడు నిదర్శనముగా కనఁబడుచున్నది. ఈయిద్దఱు వసంతకులు నేకరీతిగా నున్నారు; అప్రకారముగానే యీయిద్దఱు లక్ష్మణులునుకూడ వచ్చునఁ బోడిచినట్లొక్కవిధముగా నున్నారు. దైవవశము చేత నకస్మాత్తుగా కలిసికొన్న వీరిద్దఱును శిశుజనకులు—వసంతకా! నీవు మొట్టమొదట రామనాథపురమునుండియేకాదా కాళహస్తికి తీసికొని రాఁబడినావు?

చిన్నవ—నేనుకాను. నేను మధురాపురమునుండి వచ్చినాను.

ధర్మ—నీవు దూరముగా నిలుచుండుము. మీలో నెవరెవరో నాకు భేదము తెలియకుండనున్నది.

పెద్దవ—రామనాథపురమునుండి వచ్చినవాఁడను నేను మహాప్రభూ!

పెద్దల—ఈయనతోకూడా వచ్చినది నేను.

పెద్దవ—మమ్మిక్కడకు తీసికొనివచ్చి దేవరవారికొప్పగించినది మీ మేనమామగారైన సుబలుఁడను మహావీరుఁడు. పల్లెవాండ్రవద్దనే మమ్మాయనకొని పెంచినాఁడు.

సీత—మీయిద్దరిలో యెవరు యీమధ్యాహ్నం నాతో భోజనంచేసినారు?

చిన్నవ—నేను.

సీత—మీరు నాభర్తగారుకారా?

పెద్దవసం—అతఁడు నీభర్త కాఁడని నేను రూఢిగా చెప్పఁగలను.

చిన్నవసం—నేనును మధ్యాహ్న మీమాఱే యీమెతోఁ జెప్పినాను; కాని నామాట నమ్మినదికాదు.—ఓసుభద్రా! నేను మధ్యాహ్నము నీతో నేను చెప్పినాకో శరణమఁ బెట్టుకో; ఆమాట నిజము చేయుటకు సమయమువచ్చుచున్నది.

విశ్వ—మీరు నావద్ద పుచ్చుకొన్న దండ యిదేనా

చిన్నవ—అవును. ఎవరుకాదన్నారు?

పెద్దవ—ఈచంద్రహారము నిమిత్తము నీవు నన్ను రాజభటులకొప్పగించినావు.

విశ్వ—అవును కాఁబోలును.

సీత—నేను లక్ష్మణునిచేత మీకు ధనంపంపినాను. వాఁడు మీకిచ్చినాఁడు కాఁడు.

పెద్దవ—లేదు. నాచేత నీవు సొమ్ము పంపలేదు.

చిన్నవ—ఈమొహరులమూట నాసేవకుఁడు తెచ్చి నాచేతికిచ్చినాఁడు. మన మొకరి సేవకుని నొకరి సేవకునిగా భ్రమించుటవలన, ఈవిచిత్రములన్నియు పుట్టినవి.

పెద్దవ—ఈధనము నేను నాతండ్రి ప్రాణరక్షణము కొఱకిచ్చెదను.

ధర్మ—నీధనదానముకక్కఱలేకయే నీతండ్రికి మేము ప్రాణదానము చేసినారము.

ప్రభా—ఆవజ్రపుటుంగరము మీవేలిది కాది.

పెద్దవ—అవును నీయుంగరమిదిగో నీవుపుచ్చుకో. (అని యిచ్చుచున్నాఁడు)

చారు—ఓమహారాజా! దేవరవారు మాతో యీమఠంలోనికి విజయంచేసి, సావకాశంగా మాసంభాషణవిని, కొంచెముసేపు మాగృహపావనం చెయ్యవలెనని వేడుకొంటూవున్నాను. యీరోజున యిక్కడ పోగయి మామూలంగా శ్రమపడ్డవారందరిన్నీ కూడా లోపలికి దయచెయ్యవలెను; మేము మిమ్మల్నందరినీ సమాధానంచేసి పంపుతాము. ఓపుత్రులారా! మిమ్మల్ని యెడబాసి యిరువై సంవత్సరాలైనది; యింతకాలమునకు యెప్పుడూ యెరుగనిదే మనమందరమూ వకచోట కలుసుకున్నాము గనుక, లోపలికివెళ్ళి కొంచెంసేపు సల్లాపసౌఖ్యం అనుభవింతాము రండి.

ధర్మ—మిక్కిలి సంతోషముతో లోపలికివచ్చి మీసంభాషణవిని వేడుక పొందెదము.

[రాజును, చారుమతియు, వర్ధమానుఁడును, ప్రభావతియు, వర్తకుఁడును, విశ్వకర్మయు, పరిజనమును వెళ్ళుచున్నారు.]

చిన్నల—అయ్యా! బండిమీద యెక్కించడానికి తీసుకొని వెళ్ళిన మీసామాను పట్టించుకురానా?

పెద్దవ—నాది యేసామాను బండిమీఁద నెక్కించినావు?

చిన్నల—సత్రమువద్దనున్న మీసరుకులు.

చిన్నవ—వాఁడు నాతో చెప్పుచున్నాఁడు. లక్ష్మణా! నీయజమానుఁడను నేను. అది తరువాత తీసికొనిరావచ్చును. మాతో లోపలికిరా. ముందు నీసోదరుని కౌఁగిలించుకొని మీరిద్దఱుకలిసి లోపలికిరండి. (పెద్దవసంతకుఁడును, చిన్నవసంతకుఁడును, సీతయు, సుభద్రయు, లోపలికి వెళ్ళుచున్నారు.)

చిన్నల—నీయజమానుడి యింటికాడ కొండంతమనిషి ఒకత్తె కనపడ్డది; అది నన్ను చూచి నీవనుకున్నది; నావది సెగారుకాంతోలును!

పెద్దల—యెలాగు భేదిమప్పట్టకుండా వుంటుంది? సరిగ్గానీవు నా అద్దంలాగే నీడ లాగువున్నావు. నీరూపాన్ని చూస్తే నేనూఅందగాణ్నే అని తోస్తుంది. మనంకూడా లోపలకు వెళుదామురా.

చిన్నల—నీవు పెద్దవాడవు. ముందర నీవు నడువు.

పెద్దల—ఆభేదం మనకుతప్ప యెవరికీ తెలియదు. అందరికీ తెలియడానికి యేమిచేశాం?

చిన్నల—అందరికీ తెలియడానికి తరువాత మనంయేమైనా అనవాలు వేసుకుందాము. అందాకా నీవు ముందర నడువు (అని వెళ్ళుచున్నారు.)

సంపూర్ణము.

---



# మాళవికాగ్నిమిత్రము.



ఇది

చెన్నపురిరాజధానియందలి దొరతనమువారి కాలేజీలో

తెనుఁగు పండితుఁడుగానుండిన

కందుకూరి - వీరేశలింగము చేత

రచియింపఁబడిది.



తణుకు.

డి వి. రమణారావుగారి

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడిది.

1914.



# మొదటికూర్పు పీఠిక.



మాళవికాగ్నిమిత్రము కథ మిక్కిలి యింపయినది. ఈ నాటకము గీర్వాణకవి మండలాగ్రగణ్యుఁడయిన కాళిదాసునిచే రచియింపఁబడినది. ఇది యభిజ్ఞాన శాకుంతలము రచియించిన కాళిదాసునిచేతఁగాక మఱియొక కాళిదాసునిచేత రచియింపఁబడినదని కొందఱు చెప్పుదురుగాని యందుకుఁ దగిన నిదర్శనమేదియు లేదు! ఇందలి కథానాయకుఁ డగ్నిమిత్రుఁడు. ఇతఁడు శుంగవంశపురాజయిన పుష్పమిత్రుని కుమారుఁడు. ఈపుష్పమిత్రుఁడు మొదట మగధదేశపు రాజయిన బృహద్రథుని సేనాధిపతిగానుండి యతని చంపి, పూర్వమంత్రిని చెఱయందుఁ బెట్టించి, ఆతని రాజ్యము నాక్రమించుకొని విదిశానగరము తనకు రాజధానిగా చేసికొనెను. అందుచేత నేయాతనికి సేనాధిపతియని పేరుండెను. ఇతఁడు విక్రమార్కశకమునకు పూర్వము నూట యిరువదిరెండు సంవత్సరముల క్రిందట సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు సింధునది సమీపమున గ్రీకుదేశస్థులతో యుద్ధముచేసి వారిని జయించెను. ఇతఁడు తనవార్ధకదశయందు తనకుమారుఁడయిన యగ్నిమిత్రునకు రాజ్యమిచ్చి తానాధ్యాత్మికవిషయమున కాలముగడుపుచుండెను. ఈకాలములో తండ్రికిని కొమారునికిని కొన్ని విషయములందు పడకపోయెను. అగ్నిమిత్రుఁడు ముప్పదియాఱు సంవత్సరములు రాజ్యముచేసి మృతినొందఁగా, అనంతర మాతని కొమారుఁడు వసుమిత్రుఁడు రాజ్యమునకువచ్చి యెనిమిది సంవత్సరములు పాలనముచేసెను.

ఈమాళవికాగ్నిమిత్రము నాకు మూడు ప్రతులు లభించినవి. ఈదేశపు ప్రతికిని వంగదేశపు ప్రతికిని బహుస్థలములయందు భేదము కనఁబడుచున్నది. నేను దీనిని తెనిఁగించుటలో విశేషభాగము వంగదేశపుపండితుఁడయిన తారానాథతర్కవాచస్పతి ప్రతి ననుసరించినను, అక్కడక్కడ కొన్ని స్థలములయం దీదేశపుపాఠము ననుసరించి కొన్ని మార్పులను సహితముచేసినాను. గుణగ్రహణపారీణులు దీనియందలి దోషములను మన్నించి గుణమును గ్రహింతురుగాక!

రాజమహేంద్రవరము.<br>దీ ౧౬-ఏప్రియల్ ౧౮౮౫ సం॥ } కందుకూరి-వీరేశలింగము.



# ఈనాటకమునందువచ్చు పాత్రములు.

## పురుషులు.

అగ్నిమిత్రుఁడు—కథానాయకుఁడైన విదిశానగరపు రాజు.
వాహతకుఁడు—మంత్రి.
గౌతముఁడు—విదూషకుఁడు.
హరదత్తుఁడు—నాట్యాచార్యుఁడు; ఇరావతిగురువు.
గణదాసుఁడు—నాట్యాచార్యుఁడు; మాళవికగురువు.
మౌద్గల్యుఁడు—కంచుకి.
వీరసేనుఁడు—ఒక సేనానాయకుఁడు; రాణితమ్ముఁడు.
ధ్రువసిద్ధి—విషవైద్యుఁడు.
యజ్ఞసేనుఁడు— విదర్భదేశపు రాజు.
మాధవసేనుఁడు—మాళవిక యన్న; విదర్భదేశపు రాజు.
వసుమిత్రుఁడు—అగ్నిమిత్రుని కొమారుఁడు.
పుష్పమిత్రుఁడు—అగ్నిమిత్రునితండ్రి.
సుమతి—మాధవసేనునిమంత్రి.
సారసకుఁడు—కుబ్జుఁడు.

## స్త్రీలు.

ధారిణి—అగ్నిమిత్రునిపట్టపుదేవి.
ఇరావతి—అగ్నిమిత్రుని భోగభార్య.
కౌశిక (పరివ్రాజిక)—సుమతిచెల్లెలు, రాణికి ధర్మకథలు చెప్పునది.
మాళవిక—కథానాయకురాలు; మాధవసేనుని చెల్లెలు.
బకుళావళిక—మాళవిక చెలికత్తె.
నిపుణిక—ఇరావతి పనికత్తె.
చంద్రిక—ఇరావతిపనికత్తె.
జయసేన—అంతఃపురద్వారపాలకురాలు.
మధురిక—వనపాలకురాలు.
వసులక్ష్మి—రాజుకూఁతురు.
కౌముదిక—రాణిగారిపనికత్తె.
సమాహితిక—పండిత కౌశికిపనికత్తె.
రజనిక—విదర్భదేశమునుండివచ్చిన పాటకత్తె.

# మాళవికాగ్నిమిత్రము.

## ప్రథమాంకము.



### నాంది.

చ. ఎతఁడు మహేశుఁడై ఫలమునిచ్చినతాలిమిఁ దోలుదాల్చుఁ దా,
నెతఁడు జితేంద్రియుండయి యతీశుఁడగు సతి మేనదాల్చియున్,
ఎతఁ డలయష్టమూర్తులను నేలుచు లోకము గర్వికాఁడు తా,
నతఁడు వివేకమిచ్చి హృదయంబులఁ దామసవృత్తిఁ బాపుతన్

సూత్రి—అతివిస్తారము పనిలేదు. (తెరవంకఁజూచి) అయ్యా! కొంచె మిటురమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) బావా! ఇదిగో వచ్చినాను.

సూత్రి—శ్రీకాళిదాస కృతమయిన మాళవికాగ్నిమిత్రమను పేరుగలనాటకమును వసంతోత్సవమునం దాడవలసినదని యీసభవారిచే నేనాజ్ఞాపింపబడినాను. కాఁబట్టి సంగీతమారంభింతము.

పారి—అదికూడదు. సుప్రసిద్ధులయిన ధావక, సౌమిల్లకవిపుత్రాదులు కల్పించిన నాటకములను మాని వీరు వర్తమానకవియైన కాళిదాసునికృతి నేల బహుమానించుచున్నారు?

సూత్రి—ఓవివేకీ! నీవుచెప్పినదిసరికాదు. చూడు.—

గీ. సర్వమును ప్రాఁతదని యెందు సాదుగాదు.
క్రొత్తదనియు కావ్యమునకుఁ గొఱఁతరాదు.
యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు.
మూఢుఁడన్యులచే నమ్ము బుద్ధిలేక.

పారి—అందున కీసభవారే ప్రమాణము.

సూత్రి—అట్లయిన నీవు త్వరపడుము.

గీ. అతులసేవాసమర్థులైనయట్టి
యల్ల ధారిణి సేవకుం బిలలెనె
యేను దొంతను శిరసావహించినట్టి
యీపరీక్షను నోడ మెఱగు నిచ్చగింతు.

(అని యిద్దఱును బోవుచున్నారు)

ఇది ప్రస్తావన.

---

[అప్పుడు వకుళావళిక ప్రవేశించుచున్నది.]

వకు — క్రొత్తగా నేర్చుకొనుచున్న చలికమను నాటకమునందు మాళవిక యెట్లున్నదో నాట్యాచార్యుఁడయిన గణదాసు నడిగిరమ్మని ధారిణీదేవి నాకాజ్ఞ యిచ్చినది. కాఁబట్టి నేను సంగీతశాలకు వెళ్లెదను. (అని నడుచుచున్నది)

[అంతట ఆభరణమును చేతఁబట్టుకొని రెండవ చేటిక ప్రవేశించుచున్నది.]

ప్రథమ — (రెండవదానిని జూచి) ఓసీ! కౌముదికా! నీకీ ధైర్యమేమే! నాదగ్గఱ నుండియే దాటిపోయెదవు, నన్ను గంటజూడకున్నావు.

ద్వితీయ — ఓహో! వకుళావళికా! ఇప్పుడే నేను శిల్పివద్దనుండి తీసికొనివచ్చుచున్న దేవిగారి యీసర్పముద్రగల ముద్దుటుంగరమును గుఱించి యాలోచించుచు నీచేత దూషణపడవలసినదాన నయితిని.

వకు — (చూచి) నీదృష్టి తగినదానిమీఁదఁబడినది! మెఱుఁగులు గ్రక్కుచున్న యీయుంగరముచేత నీహస్తశాఖ పుష్పించినట్లున్నది.

కౌము — ఓసీ! నీ వెక్కడకు బోవుచున్నావు?

వకు — చెప్పినదానిని మాళవిక యెట్లు గ్రహించుచున్నదో యడుగుటకయి దేవిగారియాజ్ఞప్రకారముగా నాట్యాచార్యుఁడయిన గణదాసునియొద్దకు వెళ్లుచున్నాను.

కౌము — సఖీ! ఆమె యిటువంటి వ్యాపారముచేత దూరస్థురాలుగానున్నను రాజుచేత నెట్లు చూడఁబడినది?

వకు — ఆరాజామెను దేవిగారిపార్శ్వమునందుఁ జిత్రపటములోఁ జూచినాఁడు.

కౌము — ఏలాగున?

వకు — విను. దేవి చిత్రశాలకుఁ బోయి, అప్పుడే శిల్పాచార్యుఁడు రంగువేసి తెచ్చిన చిత్రలేఖను జూచుచు నిలుచుండెను. ఇంతలో రాజును వచ్చెను.

కౌము — అటుతరువాత?

వకు—ఉపచారమయినతరువాత నేకాసనముఁగూర్చుండి రాజుగారు చిత్రఫలకమునందు పరిజనమధ్యమున రాణిగారికి సమీపముననున్న పరిచారికను జూచి దేవిగారినడిగిరి.

కౌము—ఏమని?

వకు—దేవికి దగ్గఱఁగా వ్రాయఁబడిన యపూర్వరాలయిన యీమె పేరేమని.

కౌము—సుందరరూపములమీఁద నాదరముకలుగుట యుక్తమే. తరువాత?

వకు—సదుత్తరమురాక యనాదరము కలుగఁగా రాజుగారనుమానపడి దేవిగారిని గ్రుచ్చిగ్రుచ్చి యడిగిరి. అప్పుడు కౌమారియగు వసులక్ష్మి—"అయ్యా! ఈమె మాళవిక"—అని చప్పునఁ జెప్పివేసెను.

కౌము—(చిఱునవ్వునవ్వి) ఇది బాల్యావస్థకుఁ దగియేయున్నది. తరువాతనేమి జరిగినదో చెప్పు.

వకు—మరియేమున్నది? ఇప్పుడు మాళవిక రాజుగారి దృష్టిపథమునఁ బడకుండ భద్రముగాఁ గాపాడఁబడుచున్నది.

కౌము—ఓసీ! ఇఁక నీకు నియమించిన పనిమీఁద నీవుపొమ్ము. నేనును దేవిగారి కీయుంగరమును దీసికొనిపోయెదను. (అని నిష్క్రమించుచున్నది.)

వకు—(కొంచెము నడచి చూపు నిగిడించి) ఇదిగో నాట్యాచార్యుఁడు సంగీతశాలనుండి బయలుదేఱి వచ్చుచున్నాఁడు. నేనిప్పుడీయన దర్శనము చేసికొనెదను.

(అని నడుచుచున్నది.)

గణదాసుఁడు—(ప్రవేశించి) ఎల్లవారికిని కులవిద్య నిశ్చయముగా నాదరణీయముగానే యుండును. అయినను నాకు నాట్యవిద్యయందున్న గౌరవ మసత్యమయినదికాదు. ఎట్లగును?

చ. ఇది యమరాళికిన్ గనులకింపగు యజ్ఞమయంచు మౌను, లి
య్యది ద్వివిధంబొనర్చె శివుఁ డర్ధసతీసహితాత్మదేహమం;
దొదవు రసంబులెల్లఁ ద్రిగుణోద్భవలోక చరిత్రిందటన్,
వ్యాది దనియించు నాట్యమిల నెల్లరనున్ రుచిభేదచిత్తులన్.

వకు—అయ్యా! నమస్కారము.

గణ—సుమంగళీ! దీర్ఘాయుష్యమస్తు!

వకు—చెప్పినదానిని గ్రహించుటలో శిష్యురాలయిన మాళవిక మీకు విశేషాయాసము కలుగఁజేయుచున్నదేమో దేవిగారు మిమ్మడిగిరమ్మన్నారు.

గణ—కల్యాణీ! మాళవిక పరమనిపుణురాలనియు మేధావినియనియు దేవిగారికి విన్నవింపుము. వేయిమాటలేటికి?

క. ఏయది భావము తెల్పెడి
యాయభినయవిషయము మా మెకే నేర్పెద నో
యాయది విశేషముగ వడఁ
జేయుచు నాకదియు నేర్పు చెలువున నంతున్.

వసు—(తనలో) ప్రతిజ్ఞ యందిరావతిని మించునట్లున్నదే! (ప్రకాశముగా) గురుజనులీవిధముగా సంతోషించుచున్నారుగనుక మీశిష్యురాలిప్పుడు కృతార్థురాలు.

గణ—ఇటువంటివారులభించుటదుర్లభముగనుక, అడుగుచున్నాను. దేవిగారీమె నెక్కడనుండి రప్పించినారు?

వకు—దేవిగారికి తక్కువవర్ణమువాఁడయిన వీరసేనుఁడను పేరుగల తోడఁబుట్టినవాఁ డొకఁడున్నాఁడు. రాజుగారతని నర్మదాతీరమునందు సరిహద్దునన్న కోటకధికారినిగా నిలిపియున్నారు. అతఁడీచిన్నది ధారణీదేవికి వినోదము కలిగించుట కర్హురాలు గానుండునని యెంచి తన యక్కగారికిఁ గానుకగాఁ బంపినవాఁడు.

గణ—(తనలో) రూపవిశేషమునుఁబట్టి చూడఁగా నాకీమె సత్కులమునందుఁ బుట్టినదిగాఁ దోఁచుచున్నది. (ప్రకాశముగా) కల్యాణీ! నేను నిశ్చయముగాఁ బ్రసిద్ధుఁడ నగుదును.

గీ. నీరదజలంబు పయినుండి వారిరాశి
యందు శుక్తిలోఁబడి ముత్యమైనయట్లు
యవని సత్పాత్రమునందుఁ బడిన
శిక్షకునివిద్యయు గుణవిశేష మొందును.

వకు—అయ్యా! ఇప్పుడు మీశిష్యురాలెక్కడనున్నది?

గణ—ఇప్పుడే పంచాంగికాభినయమును నేర్చి యిఁక విశ్రాంతిపొందవలసినదని నేను జెప్పఁగా దిగుడుబావి కెదురుగానున్న గవాక్షములో మంచిగాలిననుభవించుచుఁ గూర్చున్నది.

వకు—ఇఁక దేవరవారు నాకనుజ్ఞ యియ్యవలెను. ఇప్పుడు మీసంతోషమంతయు నివేదించి దేవిగారియుత్సాహము వృద్ధిపొందించెదను.

గణ—నీవు మీదేవిదర్శనమునకుఁబొమ్ము. కొంచెమవకాశము చేసికొని యిప్పుడు నేనును మాయింటికిఁ బోవుచున్నాను.

(అని యిద్దరును నిష్క్రమించుచున్నారు.)

ఇది మిశ్రవిష్కంభము.

[అప్పుడు పరిజనులందఱుండు నిలువఁ, ఆసనాసీనుఁడై లేఖ చేతఁబట్టుకొని
మంత్రి సేవింప, రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—(లేఖ చదువుచున్న మంత్రినిఁ జూచి) వాహతకా! విదర్భరాజు యజ్ఞసేనుఁడేమి తలఁచుకొన్నాఁడు?

మంత్రి—దేవా! ఆత్మవినాశము.

రాజు—ఇప్పుడు నేనాతని యుత్తరమంతయుఁ దెలియఁగోరెదను.

మంత్రి—ఇప్పుడతఁ డీప్రత్యుత్తరము నిచ్చినాఁడు—"మాతో సంబంధము చేయనుద్దేశించిన మీపినతండ్రి కొమారుఁడయిన మాధవసేనుఁడు మాయొద్దకు రావలెనని బయలుదేఱి వచ్చుచుండఁగా దారిలో మీయెల్లప్రాంతము నధికారి యతనిని ముట్టడి వేసి పట్టుకొనెను. నన్ను విచారించి యాతనిని భార్యాసోదరీసహితముగా విడిచి పెట్టఁ దగును" అని తమకు నాకాజ్ఞ యిచ్చుచున్నారు. ఇటువంటి విషయములలో సమాన వంశమునందుఁ బుట్టిన రాజులలో నాచరింపఁబడు వ్యవహారము తమకు తెలియఁగనిది కాదు. కాఁబట్టి యిందులోఁ దమరే మధ్యస్థులుగా నుండవలెను. అతని తోడఁబుట్టినపడుచు ముట్టడించినప్పుడు పుట్టిన సంక్షోభములోఁ దప్పిపోయినది. మనుష్యులను బంపి యామెను వెదకించెదను. మీరవశ్యముగా మాధవసేనుని నాచేత విడిపింపఁ గోరినయెడల, విడుపు ధనము వినుఁడు.

"గీ. మౌర్యమంత్రినైనట్టి మామఱఁదిఁ దాను
బంధమునుండి విడిపించి పంపు కేని,
వేగ మాధవసేనుని విడుచువాఁడ
నిచటఁ జెఱసాలయందుండి యేను నవల."

రాజు—(రోషముతో) ఛట్టూ! అతఁడు తనతరము తెలిసికొనక నాతోఁ గార్యప్రతివర్తనమునకు బేరమాడుచున్నాఁడుగా! వాహతకా! స్వభావముచేతనే శత్రువయిన యీ వైదర్భుఁడు మనకుఁ బ్రతికూలుఁడుగాఁ గూడ నగపడుచున్నాఁడు. శత్రుపక్షము వాఁడుగానున్న యీతనిని పూర్వము సంకల్పించుకొన్న ప్రకారముగా నున్మూలనము చేయుటకొఱకు వీరసేనుని వశమునను న్న సేనాచక్రమున కాజ్ఞాపింపుము.

మంత్రి—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను.

రాజు—మరి యీవిషయమున నీయభిప్రాయమేమి?

మంత్రి—దేవరవారు సెలవిచ్చినది శాస్త్రదృష్టముగానున్నది. ఎట్లన—

గీ. క్రొత్తగా రాజ్యభరముఁ గైకొన్నరిపుఁడు
ప్రజలలో వేరుదిగి దృఢపడఁడు గానఁ

పాఁదుకొనని క్రొత్తగ నాటు పాదపంబు
వలెను నున్మూలనము చేయ సులభుఁడగును.

రాజా—అట్లయిన రాజ్యతంత్రకారుల వచనము వ్యర్థము కాదు. ఈవచనమే ప్రమాణముచేసికొని సేనాపతిని త్వరపెట్టుము.

మంత్రి—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[పరిజనులు తమతమ వ్యాపారము నుబట్టి రాజుచుట్టును తగినచోట్లనుండఁగా విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—"గౌతమా! ఆకస్మికముగాఁ బటమునందుఁ జూడఁబడి దటస్థించిన మాళవికను ప్రత్యక్షముగాఁ జూచేటందుకుపాయము నిప్పు డాలోచింపుము." అని మహానుభావుఁడయిన రాజుగారు నాకాజ్ఞాపించి యున్నారు. నేనా ప్రకారముగాఁ జేసివచ్చిన సంగతి యిప్పుడే యాతనికి నివేదించెదను. (అని నడుచుచున్నాఁడు.)

రాజా—(విదూషకుని జూచి) ఇదిగో! కార్యాంతరమందలి నాయపరమంత్రి వచ్చుచున్నాఁడు!

విదూ—(దగ్గరకుఁబోయి) మీరు వర్ధిల్లుదురుగాక!

రాజా—(తలయూఁచి) ఇక్కడ కూరుచుండుము.

విదూ—(కూరుచున్నాఁడు.)

రాజా—నీప్రజ్ఞానేత్రమున కేదయిన నుపాయము పొడకట్టినదా?

విదూ—ఇప్పుడు ప్రయోగించిన యుపాయసిద్ధి నడుగుఁడు.

రాజా—(సంతోషముతో) ఏలాగున?

విదూ—ఈలాగున. (అని చెవిలో నేకాంతముగాఁ జెప్పుచున్నాఁడు.)

రాజా—మిత్రుఁడా! మేలు మేలు. నీవు బహునిపుణముగా నారంభించినావు. కార్యసిద్ధి దుర్లభమేయయినను, ఈనీ కార్యారంభమును బట్టి యిప్పుడయినట్టే సంభావించెదను. ఎట్లన—

గీ. సత్సహాయసంపన్నుఁడే సంఘటింపఁ
గలుగుఁ బ్రతిబంధములుగల్గు కార్యములను
కన్నుగలవాఁడు వహితము గానలేఁడు
వస్తువులఁ జీఁకటిని దీపబలములేక.

తెరలోపల—చాలు. ఈ పెద్దడంబపుమాటలు చాలు. రాజుగారిసమక్షమున నే మనయిద్దఱిలో నెవరధికులో నెవరధములో స్పష్టము కాఁబోవుచున్నది

రాజా—(ఆలకించి) మిత్రుఁడా! ఇదిగో నీసిద్ధివృక్షము ఇప్పుడే పూఁతపట్టినట్లున్నదే!

ప్రథమాంకము.

విదూ——త్వరలోనే నీవు దానిఫలమునుం జూడఁగలవు.

[అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు——దేవా! ప్రభువుగారియాజ్ఞ జరిగించినాఁడనని మంత్రి విజ్ఞాపనము చేయుచున్నాఁడు. అంతేకాక యభినయాచార్యులయిన హరదత్త గణదాసు లిరువురును బరస్పరజయకాంక్షతోఁ దమదర్శనము నపేక్షించి రూపమునుధరించిన సాక్షాత్కోప దేవతలవలెనున్నారు.

రాజా——వారిని లోపలికిరమ్మను.

కంచు——దేవర సెలవిచ్చినట్లు చేసెదను. (అని నిష్క్రమించి వారితో మరలఁ బ్రవేశించుచున్నాఁడు.)

కంచు——ఆచార్యులారా! ఇటు, ఇటు.

గణ——(రాజునుజూచి) ఓహో! రాజమహిమదురాసదముగదా

గీ. అపరిచితుఁడుఁగా డితఁడు గురుఁడయినఁ గాఁడు;
భయపడెదనట్టులయ్యుఁ బార్శ్వంబు చేర
జలధివలె నీనృపుఁడు ప్రతిక్షణమునాదు
కన్నులకుఁ గ్రొత్తక్రొత్తగఁ గానిపించు.

హర——పురుషాకారముననున్న యీజ్యోతి మహత్తరమయినదిగదా!

ఉ. ద్వారముననియుక్తపరివారముసమ్మతిఁ జూడఁ జొచ్చి, ధా
త్రీరమణాంతికాముఁ గ్రేవనె చెంతకుఁ బోవుదండియున్
మేరకుమీఱి దృష్టి మిఱుమిట్లిటు గొల్పెడి రాజతేజమున్
జేరి మరల్పఁగాఁబడినచెల్వు వహించితి మాటలేటికిన్.

కం——ఇదె ప్రభువువారు, మీరు సన్నిధానమునకుఁబొండు.

ఉభయులు——(దగ్గరకుబోయి) దేవా! విజయోస్తు!

రాజా——మీకు స్వాగతము. (పరిజనులనుజూచి) వీరికిఁ బీఠములను బెట్టుఁడు.

[ఇద్దఱును పరిజనులు తెచ్చిన పీఠములమీఁదఁ గూరుచున్నారు]

రాజా——ఇదియేమి? శిష్యగాండ్రకు విద్యోపదేశము చేయవలసిన కాలమం దాచార్యులిరువురు నొక్కసారిగానిక్కడకు విజయముచేసినారు?

గణ——దేవా! చిత్తగింపుము. నేను సద్గురుముఖమున నభినయవిద్యను జక్కఁగా నభ్యసించినవాఁడను. దేవరవారు నాకు నాట్యాభినయాధికారమును దయచేసినారు. [illegible] నన్నాదరించుచున్నారు.

రాజా——ఇదిమాకుఁ దెలియును. అపయినేమి?

గణ—అట్టి నన్ను హరదత్తుఁడు పెద్దమనుష్యులయెదుట "నీవు నాకాలిధూళితో నయినను సమానుఁడవుగావు" అని యాక్షేపించినాఁడు.

హర—దేవా! "నాకును నీకును సముద్రమునకును బిల్లకాలువకును గల తారతమ్య మున్నది" అని యితఁడే నన్ను మొట్టమొదట దూషించినవాఁడు. కాఁబట్టి యిక్కఁడే దమరే యీతనను నన్నును శాస్త్రమునందును బ్రయోగమునందును బరీక్ష సేయుఁడు. దేవరవారే మాయల్పజ్ఞ విశేషజ్ఞ వివాదమును నిర్ణయింపఁదగినవారు.

విదూ—ఈప్రతిజ్ఞ చక్కఁగా నున్నది.

గణ—ఈసంకల్ప ముత్తమమయినది. దేవరవారు సావధానముగా వినవలయును.

రాజు—కొంచెము తాళుఁడు. ఇక్కడ పక్షపాతము జరిగినట్లు దేవి యెంచుకొనును. కాఁబట్టి పండితకౌశికీ సహితురా లయిన యామె సమక్షమునందే యీవ్యవహారము దీర్పవలెను.

విదూ—దేవరవారు సెలవిచ్చినది దివ్యముగానున్నది.

ఆచార్యులు—దేవరవారిచ్చవచ్చినట్లు చేయవచ్చును.

రాజు—(కంచుకుని జూచి) మౌద్గల్యా! ఈప్రస్తావన నివేదించి పండితకౌశికీ సహితముగా దేవిగారిని బిలుచుకొనిరమ్ము.

కంచు—దేవరవారియాజ్ఞ చొప్పున జేసెదను.

[అని నిష్క్రమించి సపరివ్రాజికయయిన దేవితో మరల బ్రవేశించుచున్నాఁడు.]

కంచు—అమ్మా! ఇటు, ఇటు.

ధార—(పరివ్రాజికనుజూచి) అమ్మా! ఈహరదత్తగణదాసులకలహవిషయమున మీకేమి తోఁచుచున్నది?

పరివ్రా—నీపక్షమున కపజయము కలుగునని శంకింపవలదు. గణదాసుఁడు ప్రతివాదికిఁ దీసిపోవువాఁడుకాఁడు.

ధార—అది యట్టిదేయయినను, రాజు చేకొనినవాఁ డగుటచేత హరదత్తున కాధిక్యము హెచ్చును.

పరివ్రా—అమ్మా! నీవును రాజ్ఞీశబ్దమునకర్హురాలవై యున్నమాట చిత్తమందుంచుకొనుము.

గీ. భాస్కరప్రగ్రహంతఁ జేసి పావకుండు
తాను మహనీయభాసురత్వంబు గన్న,
నలనిశాప్రసంగమువలన శశియు
మహిమఁ గాంచఁడె యొల్లెడ మహిని దాను?

విదూ—చూడు! చూడు! సహచారిణియయిన పండితకౌశికిని ముందుంచుకొని ధారణీదేవివచ్చుచున్నది.

రాజు—ఆమెను జూచుచున్నాఁడను.

క. యతివేషరయిన కౌశికి
యతులగతిం జేయు మంగళాలంకృతఁగా,
సతియాధ్యాత్మికవిద్యా
యుతమైన త్రయీస్వరూపయోయన నలరున్.

పరి—(దగ్గరకువచ్చి) దేవా! విజయోస్తు!

రాజు—అమ్మా! నమస్కారము.

పరి—గీ. పరమహాసార సుప్రసవత్వ మొంది
లలితసమానక్షమను దాల్చి యలరునట్టి
ధారణీభూతసంతాన ధారిణులకు
వత్సరశతంబు భర్తవై వరలుమీవు.

ధార—ప్రాణేశ్వరా! మీకు శుభముగుఁగాక!

రాజు—దేవికిస్వాగతము. (పరివ్రాజికనుజూచి) అమ్మా! పీఠమునుస్వీకరింపుము.

(అందఱును గూరుచున్నారు.)

రాజు—అమ్మా! పరస్పరవిజ్ఞానవిషయమున ఘర్షణపడుచున్న యీహరదత్తగణదాసులను మీరిప్పుడు పరీక్ష చేయవలెను.

పరి—(చిఱునవ్వునవ్వి) ఈపరిహాసము చాలును. పట్టణమొద్ద నుండఁగా పల్లెయందా రత్నపరీక్ష?

రాజు—అట్లుకాదు. నీవు పండితకౌశికివిగదా? నేనును దేవియుఁగూడ నిందుఁ బక్షపాతులము.

ఆచార్యులు—దేవరవారు సెలవిచ్చినది బాగుగనున్నది. మధ్యస్థురాలయిన యీమెయే మాగుణదోష నిర్ణయమును చేయుట కర్హురాలు.

రాజు—అందుచేతనే యీవివాద మీమెయే విమర్శింప నారంభింపవలెను.

పరి—దేవా! నాట్యశాస్త్రమునం దాటప్రధానము. కేవలవాగ్వ్యవహారముచేత నేమిప్రయోజనము? ఇందు దేవిగారి యభిప్రాయమేమో!

ధార—నాయభిప్రాయమడిగితిరా, మొదలవీరిద్దఱివివాదమే నాకురుచింపకున్నది.

గణ—దేవీ! విద్యయందు సమానుఁడనని నాకవమానము వచ్చునట్లు చేయుట నీకు ధర్మముకాదు. నన్ననుగ్రహింపవలెను.

విదూ—అమ్మా! ఈయుభయుల సంవాదమును వింటిని. వీరికి జీతము లిచ్చి వృథాగాఁ గూర్చుండఁ బెట్టనేల?

ధార—నిత్య కలహప్రియుఁడవుగా నున్నావే.

విదూ—అమ్మా! అట్లు కాదు. రెండు మదపుటేనుఁగు లన్యోన్య కలహప్రియము గలిగియున్నప్పుడు వానిలో నేదో యొకటి పరాజయము పొందక శాంతి యెట్లు కలుగును?

రాజు—అమ్మా! మీ యుభయులయొక్క నాట్యకౌశలము నీవరకే చూచియున్న వారుకదా?

పరి—అవును. చూచినదానను.

రాజు—అట్లయిన వీరిప్పుడంతకంటె నధికముగాఁ దెలుపఁగలదేమున్నది.

పరి—నేను నదే చెప్పఁదలఁచియున్నాను.

ఉ. కొందఱువిద్య నన్యులకుఁ గోవిదులయ్యుఁ జెప్ప లేరిలన్;
కొందఱు బోధ సేయుదురు గొప్పగఁ గాంచెమ తాము నేర్చియున్;
బొందుగ రెండిటం దెలివిఁ బొంది వెలింగెడు బుద్ధిశాలు రె
య్యందును నగ్రగణ్యులని యెన్నఁగఁ గాంతురు శిక్షకాళిలోన్.

విదూ—పూజ్యురాలయిన యీమె వాక్యము విన్నారుకదా? దాని సంక్షేపార్థమిది—వీరు నేర్పినది చూచుటవలన నిర్ణయింపవలెనని.

ధార—నాకిది పరమసమ్మతము.

గణ—దేవా! అలాగున జరిగింపవలెను.

దేవి—మందమతియైన శిష్యురా లుపదేశించినది తిన్నగా గ్రహింపనియెడల, అదియు గురువుదోషమేనా?

రాజు—దేవీ! అవునది యట్టిదే. చెప్పినది తెలుసుకో లేనిదానిని స్వీకరించుట లోఁగూడ బుద్ధివైభవము వెల్లడియగును.

దేవి—(తనలో) ఇప్పుడేమి చేయుదును? (గణదాసుని జూచి ప్రకాశముగా) నా ప్రాణేశ్వరుని కుత్సాహకరమైన యీ మనోరథపరిపూర్తి యింతటితోఁ జాలును. ఇఁక నిరర్థకప్రయత్నము మానుఁడు.

విదూ—దేవిగారు సెలవిచ్చినది బాగున్నది. ఓ గణదాసా! సంగీతాచార్యత్వము పొంది సరస్వతికి నైవేద్యము పెట్టి మోదకములను భక్షించుచుఁ గూరుచుండెడు నీకి పరాభవకారణమయిన శుష్కకలహములో నేమి ప్రయోజనమయ్యా?

గణ—సత్యముగా దేవిగారివాక్యమున కదే యర్థము. సముచితమయిన యీ వాక్యమును వినుఁడు—

రాజు—నన్నన్యథా భావింపకుము. ఓమహారాణీ! ఇది నేనుపన్నినది కాదు కదా? సమానవిద్యగలవారు కీర్తికొఱకొకరినొకరు తప్పులుపట్టుకొనుట సాధారణమే.

[నేపథ్యమునందు మృదంగధ్వని వినఁబడఁగా నందఱు నాలకించుచున్నారు.]

పరి—ఆహా! సంగీతమారంభమయినది.

గీ. మేఘగర్జనశంకచే మెడలెత్తి
మద్దెలరవంబుతోడ నెమళ్ళుకూయ
మధురమగు చకోరాంగనల్ మలకిచేయు
మధ్యమస్వర మలరించె మదులనిపుడు.

రాజు—దేవీ! మనమక్కడ సభికులమగుదము రమ్ము.

దేవి—(తనలో) ఆహా! ఏమి ప్రాణనాథుని యవినయము!

(అందఱును లేచుచున్నారు.)

విదూ—(రహస్యముగా) ఓయీ! ధీరత్వముతో నడుచుము. ధారణీదేవి మఱి యొకవిధముగా భావించుకొనును.

రాజు—గీ. ధైర్యమువహించియున్నను దగఁగ నన్ను
గరముఁ ద్వరపెట్టుచున్న దీమురజరవము
సిద్ధిపథమున నడుచుచుఁ జెలఁగునట్టి
స్వాంతమనోరథశబ్దంబు చందమునను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

## తృతీయాంకము.

రంగము—సంగీతశాల.

[అప్పుడు పీఠముమీఁదఁగూర్చుండి మిత్రునితోఁగూడ రాజును, ధారణియు, పరివ్రాజికయు, అర్హపరివారమును ప్రవేశించుచున్నారు.

రాజు—అమ్మా! పూజ్యులయిన యాచార్యులిరువురిలో నెవ్వరి యుపదేశనైపుణ్యము ముందుగాఁ జూతము?

పరి—పాండిత్యప్రభావముచేత నిద్దఱును సమానులేయయినను, వయోవృద్ధుఁడగుట వలన గణదాసునినే ముందుగా గౌరవింపఁదగును.

రా—అట్లయిన, మౌద్గల్యా! ఆపూజ్యులకీసంగతి తెలిపి నీవుని పనిమీఁదఁబొమ్ము.

కంచు—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని పోవుచున్నాఁడు.)

గణ—(ప్రవేశించి) దేవా! మధ్యమలయగలిగి శర్మిష్ఠచేతఁ జేయఁబడిన చతి

నాటకములలో నాలుగుపాదములుగల శ్లోకమొకటికలదు. దేవరవారు దాని ప్రయోగ మేకాగ్రచిత్తముతోఁ జిత్తగింపవలయును.

రాజా—ఆచార్యా! మేమమిక్కిలి యవహితులమయియున్నాము. పాత్రములను దీసికొనిరమ్ము!

(గణదాసుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రాజా—(జనాంతికముగా) మిత్రుఁడా!

గీ. అలయాలంకారమందిరమందు నున్న
కన్నె దర్శింపఁ గోరి నాకన్నుదోయి
క్షణముఁ గాలవిలంబము సైఁపలేక
తెరను దీయంగ సంకించుకరణి నుండె.

విదూ—(రహస్యముగా) నీ యభీప్సితమూర్తి విశేషము దృష్టిపథమునఁ బడఁబోవుచున్నది. కనుక నీవిప్పుడప్రమత్తుఁడవయి చూడుము.

[అప్పుడు తనయంగసౌష్ఠవమును జూచుచున్న యాచార్యునితో
మాళవిక ప్రవేశించుచున్నది.]

విదూ—దేవా! చూడుము. పరాధీనురాలయియున్నను, ఆమె సౌందర్యమునకుఁ గొఱఁతయేమియు లేకయున్నదిగదా?

రాజా—(రహస్యముగా) మిత్రుఁడా!

గీ. చిత్రపటమున నాఁడు వీక్షించినప్పు
డట్టి సొగసుండదని సంశయంబువొడమె
నేఁడు ప్రత్యక్షముగ నీమెఁ జూడ నిందు
శిల్పి యప్రౌఢుఁడంచుఁ దోఁచెడిని మదికి.

గణ—బిడ్డా! స్వస్థచిత్తురాలవుకమ్ము.

రా—(తనలో) ఓహో! ఈరూపము సర్వావస్థలయందును నిర్దోషముగానున్నది.

సీ. నిడువాలుఁగన్నులఁ గడునొప్పివదనంబు శరదిందుకాంతిని జానుమీఱు
అంసభాగంబుల నంవంబుగా వంగి బాహువులెంతయు బాగుమీఱు
ఘనమైననిక్కునిక్కఁ జన్గవ చేతవక్షంబు పార్శ్వమందడఁగినభాతి మీఱు
మధ్యప్రదేశంబు మానుగఁ బిడికిటఁ బట్టంగఁ దగియుండి వన్నెమీఱు
జఘనమెంతయు నమితమై సాటిమీఱు
వంపులైయొప్పునంగుళు ల్పాదములను
హృదయమున నర్తనాచార్యుఁ డెట్టులుండె
నభిలషించునో యట్లుండె నంగకరిమ.

మాళ—(ఉపగానముచేసి, చతుష్పాదగీతమును పాడుచున్నది.)

చ. హృదయమ! దుర్లభుండు ప్రియుఁ డీయనపైనిఁక నాశమానుమీ;
యదరెడు వామనేత్ర మహాహా యిపుడే మొకో నాఁడుచింతగా;
నొదవెడు నెట్లు క్రమ్మఱనయో చిరదర్శితు నీయనంగనన్?
సదయతఁ బ్రేమచేఁ బరవశాత్మగ నన్ను నెఱుంగు నాయకా!

(అని రసోచితముగా నభినయించుచున్నది,)

విదూ—(రహస్యముగా) ఓహో! మిత్రుఁడా! ఈ మెయినాలవపదార్థము నభినయించుచు నిన్ను పెట్టి తన్ను నీకర్పించుచున్నట్టుగా నున్నది!

రాజు—సఖుఁడా! మాయిరువురహృదయములు నట్లేయున్నవి.

చ. అయము 'ప్రేమచే వివశురాలను గా నిదె నన్నెఱుంగుమో
నాయక' యన్న వాక్యమును నాకడ సాభినయంబుగాఁగఁ దా
నీయెడఁ బాడుచో సరస నీవల ధారణియందు నొక్కరేఁ
బ్రియమువాని వేఁడుమిషఁ బ్రార్థనచేసెను నన్నుఁ గూరిమిన్.

[మాళవిక గీతముపాడినతరువాత వెనుకకుఁ బోఁబోవుచున్నది.]

విదూ—అమ్మా! పోకనిలువుము. నీ నాటయం దొకక్రమమును మఱచిపోతివి? నేను దానినప్పుడే నీకుఁ దెలిపెదను.

గణ—బిడ్డా! నేనుపదేశించిన విద్యయందు లోపముండదని కనఁబడుచున్నది గాని క్షణమాత్రము నిలువుము.

(మాళవిక జంకి నిలుచున్నది.)

---

* ఘంటారాగము—ఆదితాళము.

పల్లవి—ఏలవలచితి నయ్యారో! యేలాగుదరియింతు నయ్యారో!
అనుపల్లవి—ఈలాగాట తెలియనైతి ♦ నిలపయి వెతలపాలయితి.

౧. మనసా! నీవుకోరినట్టి ♦ మనుజుఁడెంతో దుర్లభుఁడు సుమ్ము.
గనుక, నీవు నామీఁది ♦ కట్టాసమానుము నేఁడు... ఏలవలచితి.

౨. ఎడమకన్ను దేమోకాని ♦ యిప్పుడెంతో తనయంత,
వడిగ నదరఁజొచ్చె నిదిగో ♦ బాగయ్యో మేలు మేలహాహా... ఏలవలచితి

౩. ఇన్నినాళ్ళకిందు నాకు ♦ నిటులలభించిన వరనాథుఁ
గన్నులారఁజూడనెట్లు ♦ క్రమ్మఱంగాఁగలుగును?... ఏలవలచితి.

౪. అపురనీ చెలింగికొమ్మి ♦ యల నీపఱుప్రేమచే
వివశురాలనంచు నన్ను ♦ వేవేగసద్గుణు భూని... ఏలవలచితి.

రాజు—(తనలో) ఆహా! ఈమెరూపము సర్వావస్థలయందును వింతసోయగమును నింపుచున్నది. ఎట్లన

మ. వలయుంబుల్ మణిబంధమందుంచి కటినొప్పంజేర్చి డాకేలు, ని
శ్చలతన్ రెండవకేలువాల్చి దిగువన్ శ్యామాలతంబోలఁగా,
నలరున్ మీటుచు నేలచూపులను బాదాంగుష్ఠమాత్రింబునన్
నిలుచున్నప్పుడె నృత్యకాలమునకంటెం జెల్వు చెల్వొందెడున్.

దేవి—ఈయాచార్యులు గౌతమునిమాటను సహితముపాటిగాఁ బట్టుచున్నారు గదా?

గణ—దేవీ! అట్లనఁగూడదు. రాజవిశ్వాసమువలన గౌతమునికినూత్నదర్శిత్వము గలుగుచున్నది. చూడుము—

గీ. చిల్లగింజల పొడితోడఁ జేయకతనఁ
కల్మషజలంబు స్వచ్ఛతఁ గాంచునట్లు
పండితులతోడి సహవాసబలముచేత
మందుఁడైనను గడుబుద్ధిమంతుఁడగును.

(విదూషకునిజూచి) మీయభిప్రాయమును వినఁగోరుచున్నాము.

విదూ—(గణదాసునిజూచి) ముందుగాఁ బండితకౌశికి నడుగుఁడు. నేను గనిపెట్టిన క్రమభంగమును తరువాతఁ జెప్పెదను.

గణ—అమ్మా! గుణముగాని దోషముగాని నీవు కనిపెట్టినది సెలవిమ్ము.

పరి—నేను జూచినంతవఱకు సర్వమును నిర్దుష్టముగానున్నది. ఎందుచేతనన—

చ. పలుకులయర్థముంగముల బాగుగఁ గన్పఱుపంబడెన్; రసం
బుల లయతోడ నైక్యమునుబొందెఁ బదంబులు పెట్టురీతి; యిం
పలరెను గొంచెమై మృదుకరాభినయంబు తరానువృత్తులన్;
వెలసె మనోహరంబగుచు నింతగ భావము రాగబద్ధమై.

గణ—దేవరవారెట్లు భావించుచున్నారు?

రాజు—మాకు స్వపక్షమువారియెడఁగలయభిమానము తగ్గిపోయినది!

గణ—నేనిప్పుడు నర్తనాచార్యుఁడనయినాను.

గీ. జగతి నిష్పక్షపాతులౌ సాధుజనులె
శిష్యునివిద్యాశుద్ధత చెప్పగలరు
వహ్నియందును బంగారువలెనె మీదు
సన్నిధిని శిష్యకౌశల మాచరువుకూడ.

దేవి—అయ్యా! మీరదృష్టవంతులు. ఈపరీక్షకులచేత మెప్పుపొందినారు.

గణ—దేవీ! మీపరిగ్రహమే నావృద్ధికి హేతువు. (విదూషకునిఁజూచి) గౌతమా! నీమనస్సులోనున్నదేమో యిప్పుడు చెప్పుము.

విదూ—ప్రథమోపదేశదర్శనసమయమునందు ముందుగా బ్రాహ్మణపూజ చేయవలెను. మీరాపూజను మరచిపోయినారు.

పరి—ఓహో! ఇది ప్రయోగములోపలి ప్రశ్నగదా!

[అందఱును నవ్వుచున్నారు. మాళవికయుఁ జిఱునవ్వు నవ్వుచున్నది.]

రాజా—(తనలో). కన్నులు గలిగినందునకుఁ జూడవలసిన సారమునుజూడఁగాంచితిని! ఎట్లన—

గీ. పల్వరుసయింత కానంగఁబడఁగ మంద
హాస మొనరించు నీవిశాలాక్షి మోము
కేసరంబులొక్కింత లక్షింపనయిన
కమలమునుబోలి యందమైకానిపించు.

గణ—ఓదొడ్డబ్రాహ్మణుఁడా! ఇదిపరీక్ష కాని యాటకాదుగదా? ఆటయే యయినపక్షమునఁ బూజార్హుఁడవయినను నిన్నుఁ బూజింపకుందుమా?

విదూ—నేను నిశ్చయముగా నీరుత్రాగవలెనన్న యాశతో వట్టియుఱుములుగల యాకాశమును గనిపెట్టుకొనియున్న చాతకపక్షి నయినాను.

పరి—అలాగుననే యయినావు.

విదూ—అట్లయినఁ బండితులసంతోషమువలన లాభము పొందవలెనని నమ్మియున్న నావంటివారు కేవలమూఢులు. పూజ్యురాలయిన యీపరివ్రాజిక మెచ్చినది గనుక నేనీయనకు బహుమానమిచ్చెదను. (అని రాజుచేతినుండి బంగరుమురుగును దీయుచున్నాఁడు.)

దేవి—నిలువుము. రెండవవారి గుణతారతమ్యముకూడఁ దెలియకమునుపే నీవీ యాభరణ మేలయిచ్చెదవు?

విదూ—ఇది మఱియొకరిసొత్తుగనుక.

దేవి—(ఆచార్యునివంకఁజూచి) అయ్యా! గణదాసా! మీశిష్యురాలు విద్య కనఁబఱచుటయయినదిగదా?

గణ—బిడ్డా! మనమింక వెళ్లుదము రా. (ఆచార్యునితోఁగూడ మాళవిక పోవుచున్నది.)

విదూ—(రహస్యముగా) దేవరసేవ చేయుటలో నాబుద్ధివైభవమింతే.

రాజా—ఇంతే యన్నమాటచాలింపు.

గీ. ఆమె తెఱచాటువను మఱుఁగగుట కాదు
కనులకును భాగ్య మస్తమించినవిధంబ
హృదయమున కుత్సవసమాప్తి యొదవినట్లు
హర్షమునకు ద్వారము మూసినట్లుఁ దోఁచు.

విదూ—(రహస్యముగా) మేలు! దరిద్రాతురునివలె వైద్యునినే యౌషధము చేసి పెట్టుమనుచున్నావు!

[హరదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హర—దేవా! ఇప్పుడు నాయొక్క విద్యోపదేశమును జిత్తగించుట కనుగ్రహింపుఁడు.

రాజు—(తనలో) నేను జూడఁగోరినది సమాప్తమయినది. దాక్షిణ్యముకతనఁ బలుకుచుఁ (ప్రకాశముగా) మేము చూడ వేడుకగలవారమయియే యున్నాము.

హర—నేను ధన్యుఁడనయినాను.

[తెఱలో వైతాళికుఁడు.]

దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! మధ్యాహ్నమగుచున్నది. అందుచేతనే—

ఉ. అంచలు కన్నుమూసెడును నంబుజపత్రముసీడ డిగ్గియున్,
మించినవేఁడిఁ, జేరవలె మేడలచూరులు పావురంబులున్,
కాంచి నెమళ్ళు పోయెడు దగన్ జలయంత్రముచేర నీటికై,
మించెఁ బ్రతాపపూర్ణుఁడయి మీవలెనే రవియున్ నృపాలకా.

విదూ—అయ్యో! అయ్యో! మాకు భోజనవేళ యయినది. వేళతప్పినయెడలఁ బ్రభువువారికి జబ్బుచేయునని వైద్యులు చెప్పుచున్నారు. హరదత్తా! నీవేమి చెప్పెదవు?

హర—ఇప్పుడు నాకేమి చెప్పుటకును నవకాశము లేదు.

రాజు—(హరదత్తునివంకఁ జూచి). అట్లయిన మీయుపదేశమును రేపు చూపవచ్చును. ఇప్పటికిఁ జాలింపుఁడు.

హర—దేవరవారాజ్ఞయిచ్చినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

దేవి—దేవరవారు మాధ్యాహ్నికకృత్యములను దీర్పవలెను.

విదూ—దేవీ! అన్నపానములు నేఁడు త్వరపెట్టి విశేషముగాఁ జేయింపుము.

పరి—(లేచి) మీకు శుభమగుఁగాక! (అని దేవితోఁగూడ పోవుచున్నది.)

విదూ—ఓహో! కేవలరూపమునందే కాక నాట్యమునందుఁ గూడ మాళవిక యసమానురాలుగానున్నదే.

రాజు—మిత్రుఁడా!

మధు—ఓహోహో! సమాహితికవా? సఖీ! నీకు స్వాగతము.

సమా—ఓసీ! "నావంటివారు రాజుగారిని రిక్తహస్తములతోఁ బోయి చూడఁ గూడదు గనుక. దర్శనము చేయుటకోరు నాకొక బీజపూరము కావలసియున్నది." అని పూజ్యురాలయిన పరివ్రాజిక నీకానతిచ్చుచున్నది.

మధు—ఇదిగో నిమ్మపండు సమీపముననే యున్నది కాని, పరస్పర వివాదము గలుగుచున్న నాట్యాచార్యుల యుపదేశమును గూర్చి, అపూజ్యురా లెవరిని మెచ్చినదో చెప్పు.

సమా—ఇద్దఱును పాండిత్యమును ప్రయోగనైపుణ్యమును గలవారే. అయినను శిష్యురాలిగుణవిశేషముచేత గణదాసుఁడే యధికుఁడని చెప్పఁబడినాఁడు.

మధు—అట్టి రాజుగారికి మాళవికవిషయమయిన రహస్య వ్యాపారమును నీ వేమయిన విన్నావా?

సమా—రాజా మెయందు గాఢానురాగము కలవాఁడైయున్నాఁడు; కాని కేవలము ధారిణీదేవియొక్క మనస్సునొప్పించుట కిష్టములేక తన ప్రభుత్వమును గనఁబఱుపకున్నాఁడు. ఈదినములందుండు వాడిపోయిన మాలతీమాలవలెనే మాళవికయు శోషిల్లి కనఁబడుచున్నది. అంతకంటె నాకుఁ దెలియదు. నన్ను విడిచిపెట్టుము.

మధు—ఈకొమ్మయందు ప్రేలుచున్న నిమ్మపండు తీసికొనిపొమ్ము.

సమా—(కోసికొన్నట్టభినయించుచు) సఖీ! ఈసాధుజన శుశ్రూషచేత నీవింతకంటెను మంచిఫలమును బొందుము. (అని బయలుదేఱుచున్నది.)

మధు—సఖీ! మనము కలసిపోవుదము. నేనుగూడవచ్చి చిరకాలమునుండి పూఁతపట్టకున్న యీకాంచనాశోక వృక్షమునకు దోహదము చేయించు నిమిత్తమయి దేవిగారితో మనవి చేసెదను.

సమా—అవును, అది నీపని కాదా? (అనియిద్దఱునుబోవుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

[అప్పుడు కామావస్థనున్న రాజును విదూషకుడును ప్రవేశించుచున్నారు]

రాజా—(తన్నుఁ జూచుకొని)

ఉ. కాయము చిక్కెఁ జెల్లు నలకామిని కౌఁగిలిసౌఖ్య మబ్బమిన్;
బాయక కన్ను నీరు విడుచుం గనఁగన్ క్షణమేని చూడమిన్;
తోయజనేత్రి నింద్యకయుఁ బ్రోదిక్రోలంగనియుట్టిసిపున
శ్వాయతతాపమొందెదవపో యిది యేమిటికిందు? డెందమా!